ప్రథమ ముద్రణ : జనవరి 1984
ద్వితీయ ముద్రణ : ఆగష్టు 1984
తృతీయ ముద్రణ : అక్టోబరు 1990

ప్రతులు : 3,000



---

వలయువారు :-

1) జఫర్ బుక్ డిపో, కచ్చేరిమిట్ట, కావలి, నెల్లూరు జిల్లా.
2) మదీనా బుక్ డిపో, చిన మసీదు, ఒంగోలు.
3) రహీమియా బుక్ డిపో, అంజుమన్ బిల్డింగు, గుంటూరు
4) ఉర్దు బుక్ స్టాల్, ఇస్లామ్‌పేట, విజయవాడ.
5) కమర్షియల్ బుక్ డిపో, చార్మినార్, హైదరాబాద్-500 002
6) మక్తబా-యె-దారుల్-ఖురాన్, షాహీపేట, కడప-516 001
7) ఖురాన్ బుక్ సెల్లర్, 13/85 చౌక్, కడప - 516 001
8) అహ్మద్ అలి బుక్ సెల్లర్, ముఅజ్జమ్‌జాహి మార్కెట్, హైదరాబాద్.
9) Md. అస్లమ్‌ఖాన్ బుక్ సెల్లర్, రహమతాబాద్, నెల్లూరు జిల్లా
10) దఫ్తర్-మజలిస్-యే-ఇల్‌మియా, మహబూబ్ బజార్. చాదర్‌ఘాట్, హైదరాబాద్ - 500 024
11) జియా బ్రదర్స్, కర్నూలు - 518 001
12) సిరాజ్ బుక్ డిపో, ఖిలా మస్జిద్, వెల్‌గోడ్ - 518 533
13) కౌసర్ బుక్ ఏజన్సీ, కదరి - 515 591
14) అస్లామ్‌ఖాన్ బుక్ సెల్లర్, అనాసముద్రంపేట, నెల్లూరు జిల్లా.

---

ముద్రణ : వావిళ్ల ప్రెస్, కావలి.

# మానవతాదీపం

రచయిత :

**పి. హుసేన్‌ఖాన్**

జాతీయ ఉత్తమ ఉపాధ్యాయ గ్రహీత

రిటైర్డు ఉర్దు మున్షి, జిల్లా ప్రజాపరిషత్ హైస్కూలు,

కావలి, నెల్లూరు జిల్లా.

Approved by the Director of State Council of
Educational Research & Training (A.P.)
Hyderabad.

L. Diss R.C. No. 166/B5/89/dated 5-5-90

Approved by the Government of Andhra Pradesh
Department of Public Libraries.

List No. 26 Citation No. 10444/801/7090 dated 11/2/86

R. C. No. 465/Class/86

పబ్లిషర్ :

**ముక్తబా-యె-నూర్**

ముస్లింపుర, కావలి, నెల్లూరు జిల్లా (ఆం ప్ర.)

# NATIONAL AWARDS FOR TEACHERS

CITATION
1981.

The Ministry of
Education and Culture,
New Delhi.

—

**SHRI P. HUSSAIN KHAN**
Urdu Munshi Grade-I
Z.P. Boys High School
Kavali, Nellore Dist.

He has maintained a meritorious teaching record for the last 35 years. He is Urdu Munshi and has contributed many articles in Urdu magazines. He is the author of many books including the Grammar text "Hafeez-U 1 Qawaid" which has been approved by the Board of Studies of the Andhra, Annamalai, Madras and Sri Venkateswara Universities. He has special interest in coaching classes and offers financial aid to the gifted students belonging to poor families. He has donated cash award for the best two students of 7th and 10th classes every year. The United States Library of Congress has selected his book "Shuaa-E-Noor" for American Libraries. He maintains proper discipline and commands great respect among the students. He maintains cordial relations with his colleagues and the community holds him in high esteem for his devotion to the profession.

# రచన ఉద్దేశం

ఈ పుస్తకం మనోల్లాసకరమైన రంగు రంగుల పుష్పముల గుచ్ఛము. ఇందులో మానవుని సన్మార్గముని చేసే ఇతివృత్తాలు మహనీయుల జీవితానుభవముల ద్వారా నేర్చుకోదగ్గ గుణపాఠాలు ఆదర్శ జీవనాన్ని బోధించే వెలుగు కథలు ఉన్నాయి.

సరళమైన భాషతో అందరికీ అర్థమయ్యే శైలిలో వ్రాయబడినవి. అందరూ చదువుకునేందుకు వీలయినవి. జీవితాన్ని తీర్చి దిద్దుకొనేందుకు ఉపయోగించేవి. ఏ కొంచెం చదువుకున్న స్త్రీ పురుషులకైనా ఈ కథలను స్వంతంగా పఠించి ఆనందించగలరు.

విద్యార్థులు ఈ కథలు చదివితే వారిలో తప్పక మార్పు వస్తుంది. ఈ కథలు వారి శీల నిర్మాణానికి దోహదం చేస్తాయి. ఆ విద్యార్థులు రాబోవు సంతానానికి ఆదర్శప్రాయులుగా తయారవగలరు.

సంసార లంపటంలోపడి దారి తెన్నులేక కొట్టుమిట్టాడే జనానికి ఇవి కాంతి కిరణాలై వారికి మార్గాన్ని చూపుతాయి. జీవితాన్ని వ్యర్థం చేయవద్దని హెచ్చరిస్తాయి.

పాపపు తుఫానులో చిక్కి, గమ్యం తెలియక అల్లాడేవారిని తీరం చేర్చి, సేవతీర్చి జీవితానికి చుక్కానిని చూపగలవు ఈ కథలు.

ఈ పుస్తకం వలన పాఠకులందరూ, ముఖ్యంగా విద్యార్థులు లాభం పొందగలరని ఆశిస్తున్నాను. తెలుగు తెలిసిన ప్రతి ఇంటిలో ఈ పుస్తకం వెలుగు దివ్వెగా కాంతి నివ్వగలదని నమ్ముతున్నాను.

ఇట్లు

పి. హుసేన్‌ఖాన్

# తోచిన మాటలు

ఉభయభాషా ప్రవీణ
**శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి**
రిటైర్డ్ లెక్చరర్, ఆంధ్రప్రదేశ్ ఆకాడమి సభ్యులు
భారత ప్రభుత్వ సాంస్కృతిక శాఖ సీనియర్ సభ్యులు

ఇందులో 30 కథలున్నాయి.

వీటిని సమకూర్చినవారు నా ముస్లీమ్ మిత్రులు జనాబ్ పి. హుసేన్‌ఖాన్‌గారు. ఇవి వీరు స్వంతంగా కల్పించినవి కావు. విన్నవీ, కన్నవీ సేకరించి "ఇవి లోకానికి మేలుచేస్తాయి. మామూలుగా ఎదుగుతూ, లోకాన్ని కొత్తగాచూచె విద్యార్థులకు మరీ ఉపయోగిస్తాయి కొత్త స్ఫూర్తినిస్తాయి" అనే తలంపుతో వీటినికూర్చారు.

మిత్రులు శ్రీ పి. వెంకటేశ్వర్లుగారు శుభ్రంగా అందరికి తెలిసే తెనుగులోతీర్చి తెలుగువారికి మరింత దగ్గరగా తెచ్చారు.

వీటిని మామూలుగా అంటే నీతికథలనవచ్చు కాని ఆ మాట పాతబడి దాని విలువ, ప్రత్యేకత కోలుపోయి ఒక మెతకవాసన తగులుతుంది.

ఈ కథలను వెలుగు కథలనడం నాకిష్టం. దానికి అనుగుణంగా హుస్సేన్‌గారు పెట్టిన పేరు "మానవతా దీపం" అనే పేరు నా మనస్సుకు చక్కగా కుదిరింది.

మశీదు, చర్చి, దేవాలయం వరుసగా ఉంటే కొందరు తమ ఇష్టా నిష్టాలనుబట్టి మొక్కడం, మొఖం ముడుసుకోవడం చేస్తారు. దేవుడంటూ ఉంటే ఆయన ఫక్కున నవ్వి ఇందులో ఎవ్వడికి నిజానికి

నేనక్కరలేదు. పక్కవాడిని వంచించె ఇదొక అలవాటైన నటన - అని తప్పకుండా అనుకుంటాడు.

'అడుగడుగున గుడివుందీ, అందరిలో గుడివుంది'
అనుకోగలవాడే ముక్తుడవుతాడు.

పంచతంత్ర హితోపదేశ కథలు మనకు తెలిసినవే. అందులోని హైందవ భావగంధం, భారతీయ సంస్కృతి, ఆలోచనా సరణి, ఉదాహృత కథలూ మనకు సుపరిచితాలు. ఏ ప్రవక్త ఉద్గ్రంథం చెప్పినా పిండితాంశం ఒక్కటే 'పరోపకారహః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" అను సూక్తి ప్రతిధ్వనే ఈ అన్నీ కథలకూ వినిపిస్తుంది.

ఈ పుస్తకంలో మహ్మదీయ కథలు ఎక్కువ ఉన్నా జీవన్ మున్నగు మహాపురుషుల ఉద్బోధకరమైన కథలూవున్నాయి.

అలవోకగా రెండు మూడు కథలు చదివి, లాంఛన ప్రాయంగా నాలుగు మాటలు వ్రాయాలనుకున్నాను. కానీ అన్నీ చదివించాయి. చదివితేకాని తోచలేదు. సాధారణంగా మనం వినని కొత్త కథలివి. అన్యసత్పురుషుల జీవితాలలోనుంచి, వారి వారి విభిన్న భావములనుంచి, అనుభూతులనుంచి, చిత్త సంస్కారంనుంచి. జాతీయతనుంచి ఊడిపడ్డ కథలివి. ప్రతి కథలోను సూక్తి చెప్పడంలో కథ ప్రవర్తిల్లడంలో, చరాలున వెలిగే ఒక మెరుపు కనిపిస్తుంది. చమత్కారంగా ముగుస్తుంది.

ఏ కథా సాధారణంగా విస్తరించి వుండదు. పుట తప్పితే రెండు పుటలు సాగి చట్టున ముగుస్తుంది. తాను పుట్టిన పనిని పూర్తిగా నెరవేర్చుకొని మరీ అదృశ్యం అవుతుంది.

అన్నీ మంచి కథలు. మంచిని ఎలుగెత్తి చెప్పే కథలు. కాంతా సమ్మితంగా కిసుక్కున నవ్వి వ్యంగ్యంతో కొట్టిపోయే కథలు కొన్ని మరీ మంచివి వున్నాయి.

హైందవ కావ్యాలోని వంటివికూడా ఉండి విస్మయం కలిగిస్తాయి.

3వ కథ సిరియాళుని కథకు దగ్గరగా వుంది. ముగింపు వేర్తైనా.

24వ కథ పాప పుణ్యాలకథ. గుణనిధి, సుకుమారుడు, నిగమశర్మ కథల్లావుండి కొత్తవెలుగును ప్రసరించింది.

21వ కథ మౌలానారూమ్ చెప్పింది, చెప్పలేనంత గొప్ప కథ. మనుషులతో కిక్కిరిసిన ఈ ఎడారి చీకట్లో, అచ్చపు మనిషి కోసం దీపం పట్టుకు వెతకాలి; నిరాశపడకూడదు. ఎప్పటికైనా ఆ వెల్గులో అచ్చపు మనిషి దొరకక పోడు, అదే ఆశ అంటుంది.

కనుకనే హుసేన్‌గారు దీనికి "మానవతా దీపం" అని పేరు పెట్టారు.

దయ, క్షమ, త్యాగం, సౌజన్యం అనే గుణాలతో అర మగ్గిన పండులాంటి మానవుడు కావాలి.

అట్లాంటి మానవుణ్ణి సృష్టించడానికి ఇట్లాంటి కథలు, గాథలు రావాలి.

మొహర్రమ్ ఇట్లు

కావలి, 17-10-83 ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

---

## పరిచయ వాక్యాలు

న్యూ ఢిల్లీ,
15-6-1978

జనాబ్ హజీ హాఫీజ్ మహ్మద్ యూసఫ్‌సాహెబ్ కోకస్ ఉమ్రి
ప్రొఫెసర్ అరబిక్ అండ్ పర్షియన్
యూనివర్సిటి గ్రాంట్స్ కమీషన్, న్యూ ఢిల్లీ.

హుసేన్‌ఖాన్‌గారు అందరి అభినందనలకు అర్హులు కొన్ని సంవత్సరములనుండి ప్రయోజనకరమైన గ్రంథాలు వ్రాస్తూ వస్తున్నారు. ఉన్నతమైన శైలిలో అతిసూక్ష్మమైన విషయాలనుకూడా వివరించి వున్నారు. ఈ గ్రంథాలవలన సాధారణమైన ప్రజలుకూడా లాభం పొందుతున్నారు. ఇంతకుముందు విశ్వాసపు వెలుగు, కాంతి కిరణము అనే పుస్తకాలు వ్రాసి వున్నారు. వీటిని అతి ఇష్టంతో చదివారు. ఇప్పుడు "మానవతా దీపం" పేరుతో అతివిలువైన గ్రంథం వెలువరిస్తున్నారు. దీనిలోని మానవ జీవితంలోని వివిధ రీతులు, వారి సహజ ప్రవృత్తులు చదివితే మన హృదయంలోని మేధస్సులోని అంధకారం దూరమై మానవతా రత్నం కాంతుల నీనుతుంది. అరబిక్ భాషలో ఇటువంటివి అనేకమున్నాయి. ఉర్దూలో ఈ ఒరవడి ప్రారంభించినందుకు నాకు చాలా సంతోషంగా వుంది. ఇంకా అనేకం ఇటువంటివి తేవాలని ఆశిస్తాను. ఖాన్‌గారు 'హాఫిజుల్ కవాయిద్' అనే ఉత్తమ వ్యాకరణాన్ని వ్రాసి చాలా సేవచేశారు. 'ఇస్లాం చరిత్ర' కూడా మంచి గ్రంథం "ఉదయగిరి చరిత్ర" వ్రాసి ఆ చారిత్రక వివరాలను వెలుగులోనికి తెచ్చారు. ఇలాంటి గ్రంథాలు ప్రజలకు కుతూహలాన్ని రేపి, విజ్ఞానాన్ని కలిగిస్తాయి. వీరికి నా హృదయ పూర్వక అభినందనలు. వీరు దేశానికి, సంఘానికి మంచి సేవ చేయుదురుగాక.

శ్రేయోభిలాషి

మహమ్మద్ యూసుఫ్ కోకన్

ప్రొఫెసర్ అరబిక్ & పర్షియన్

# విషయ సూచిక

بِسْمِ اللّٰهِ الرَّحْمٰنِ الرَّحِيْمِ

కరుణామయుడు, అత్యంత దయామయుడగు
అల్లాః పేర (ప్రారంభము)

# 1. సత్ప్రవర్తన

హజరత్ రసూల్లుల్లాహ్ (సా) ఒక చెట్టు క్రింద విశ్రాంతి తీసుకుంటున్నారు. వారి అనుచరులంతా కొంతదూరంలో ఉన్నారు.

ఇదే మంచి సమయమని ఒక దుర్మార్గుడు రసూలుల్లాహ్ (సా) వారిని సమీపించి కత్తి దూశాడు.

వాడు కోపోద్దీపితుడై రసూలుల్లాహ్ (సా) ను లేపి "నిన్నిపుడు రక్షించే వారెవరు?" అని ప్రశ్నించాడు.

"అల్లా!" అని రసూలుల్లాహ్ (సా) దృఢమైన స్వరంతో విశ్వాస భరితమైన మాట అన్నారు.

ఆ మాటలో ఏంశక్తి ఉందోగాని శత్రువును కంపింపజేసింది అతడి చేతిలోని కత్తి క్రిందపడిపోయింది.

హజరత్ రసూలుల్లాహ్ (సా) ఆ కత్తిని తీసుకొని "ఇప్పుడు నిన్నెవరు రక్షిస్తారు?" అని అడిగారు.

ఆ మూర్ఖుడు "మీరు తప్ప నన్నెవరూ రక్షించలేరు. మీరే కాపాడాలి" అని వేడుకొన్నాడు.

రసూలుల్లాహ్ (సొ) హే అల్లా! ఇంత ఆపద సమయంలో కూడా వీడి నోటి నుండి "అల్లా!" అనే శబ్దం రాలేదే అని బాధ పడ్డారు.

అతన్ని క్షమించి వదలి వేశారు.

తర్వాత ఆ దుర్మార్గునిలో పరివర్తన కలిగింది హజరత్ మహమ్మద్ (సొ) మక్కాను జయించిన తర్వాత ఆ పాపాత్ముడు ఇస్లాం మతాన్ని స్వీకరించి, అల్లాః పై విశ్వాసము పెంచుకున్నాడు.

---

## 2. సత్ఫలితం

పూర్వకాలంలో జరిగిన ఒక కథను రసూలుల్లాహ్ (సొ) తన సహచరులకు ఇలా వివరించారు.

ఒక ప్రయాణీకుడు ఎడారి ప్రాంతంలో పోతున్నాడు. ఆ సమయంలో మేఘాల నుండి అద్భుతవాణి వినవచ్చింది.

"అదిగో ఆ తోటకు నీరు నింపుము."

ఈ వాక్కు విని మేఘం ఆ తోటవైపుకు వెళ్ళి వర్షించింది. కాలువలు నిండి తోటకు, పొలానికి నీరు పెట్టబడింది.

ఆ ప్రయాణీకుడు కాలువ ప్రవహించే వైపుకు వెళ్ళాడు.

అక్కడ ఒక మనిషి నిలబడి పొలానికి నీరు పెడ్తున్నాడు.

"ఏమోయీ! నేను మేఘాల నుండి వచ్చిన మాటలను విన్నాను. నీ పొలానికి నీళ్ళు పెట్టమని దైవవాక్కు వినిపించింది. ఆ వాక్కు విని మేఘాలు వర్షించాయి. మరి నీ పొలానికి నీరు పోయమని దైవం చెప్పేంత మంచిపని నువ్వేంచేశావు? నీ పంటను ఎలా ఉపయోగిస్తావు" అని ప్రయాణీకుడు ప్రశ్నించాడు.

"ఓ స్వామీ! నాకుపండిన ధాన్యాన్ని మూడు భాగాలు చేస్తాను ఒక భాగం పేదసాదలకు, మరో భాగం సంసారానికి, ఇంకోభాగం పొలంలో విత్తనాలకు ఖర్చు పెడతాను. అంతకంటే నేనేమి మంచి పని చేయడం లేదు స్వామీ!" అన్నాడారైతు.

దేవరహస్యం తెలుసుకున్నాడా యాత్రికుడు.

అవును, వ్యాపారంలోగాని, వ్యవసాయంలోగాని దయా దాక్షిణ్యాలు, నీతినిజాయితీలు పాటిస్తుంటే సత్ఫలితం కలుగుతుంది అల్లాః అనుగ్రహం అటువంటి వారిపైనే ప్రసరిస్తుంది.

---

# 3. పరివర్తన

ఒకనాటి విషయం.

కొందరు మనుషులు హజరత్ రసూలుల్లాహ్ (సొ) గారి వద్దకు వచ్చారు. తన అనుచరులకు ఒక్కొక్కరికి ఒక్కొక్కరిని ఒప్పగించి అతిధి మర్యాదలు చేయమన్నారు. వచ్చిన అతిధులను తలా ఒకరు పంచుకొని ఇంటికి వెళ్ళారు.

ఒకడు మాత్రం మిగిలిపోయాడు. అతన్ని ఎవరూ తీసుక వెళ్ళలేదు. అతనిని హజరత్‌గారే తమ యింటికి తీసుకవెళ్లారు.

అందరినీ పస్తు పెట్టాలనే కుత్సితబుద్ధి అతడికి కలిగింది, అందరికి వండిన భోజనాన్ని తానొక్కడే భోంచేశాడు.

ఆ రాత్రి ఆ యింటిలోని వారందరూ పస్తున్నారు.

మంచి పరుపు వేసి పండుకోమన్నారు.

రాత్రి అతనికి తిన్నది అరగక కడుపులో నొప్పి వచ్చింది. దానిపై విరోచనాలయాయి.

పరుపును, గదిని అంతా ఖరాబు చేశాడు. ఉదయాన వాళ్లు చూస్తే ఏమనుకుంటారోనని అతడు చెప్పకుండా యింటిలోనుంచి ఉడాయించాడు.

తెల్లవారింది.

అతిథిని పలకరిద్దామని హజరత్‌గారు గదిలోకి వచ్చారు. అతిథి కనుపించలేదు. అతని కోసం అంతా వెదికారు. కనుపించలేదు. గదిని, పరుపును చూశారు. అసహ్యించుకోలేదు. అతిథిపై కోపగించుకోలేదు. ఆ గది పరిస్థితి చూచి 'అయ్యో;' అతనికి ఆరోగ్యం చెడినట్లుంది ఇప్పుడేలాగుందోనని హజరత్ గారు బాధపడ్డారు.

హజరత్‌గారే గదిని స్వహస్తాలతో శుభ్రం చేశారు. పరుపును తీసుకవెళ్ళి శుభ్రపరుస్తున్నారు.

అతిథి తన వస్త్రాల ఖడ్గాన్ని హజరత్‌గారి ఇంటిలో మరచి పోయాడు. విధిలేక ఖడ్గం కోసం తిరిగి వచ్చాడు. రావడంతోటే పరుపు శుభ్రం చేసే హజరత్‌ను చూచాడు.

నీరైపోయి బాధపడసాగాడు

అతన్ని చూచి రసూలుల్లాహ్ (సొ) అత్యంత అదరముతో "ఏమండీ మీ ఆరోగ్యమెలాగుంది?" అని సహనముతో, మర్యాదగా ప్రశ్నించారు.

హజరత్‌గారి ప్రవర్తన, సహనము అతనిలో పశ్చాత్తాపాన్ని మేల్కొలిపాయి. అసభ్యంగా ప్రవర్తించినందుకు బాధపడి, క్షమాపణ వేడి, హజరత్‌గారి శిష్యుడైపోయాడు.

## 4. బోధనలో నేర్పు

రసూలుల్లాహ్ (సొ) ప్రవక్త తన సహచరులతో కూర్చుని ఉన్నారు. ఖురేషి యువకుడొకడు అక్కడికి వచ్చాడు.

అతడు ప్రవక్త వద్దకువచ్చి "నాకు వ్యభిచారమనే దుర్వ్యసనం ఉంది. ఆవ్యసనాన్ని వదలలేను. అలాచేసేందుకు అనుమతించండి" అని కోరాడు.

ప్రవక్త అనుచరులంతా అతని సిగ్గులేని తనానికి, పొగరుబోతు వ్యవహారానికి కోపగించారు. అతన్ని అసహ్యించుకున్నారు. అతన్ని తన్ని తరిమివేయాలని చూచారు. ప్రవక్త గారితో అలా అసభ్యంగా బరితెగించి మాట్లాడుతాడా? వాడికి తగిన శాస్తి చేయాలిసిందే అని భావించారు.

ప్రవక్తగారు వారినందరిని వారించారు. వారిని ఉద్రేకపడవద్దని కోరారు.

ఆ యువకుణ్ణి పిలిచి అతి నెమ్మదిగా అడిగారు. "బాబూ! ఇటువంటి వ్యవహారం ఎవరైనా నీ తల్లి పట్ల చేస్తే నీవు ఒప్పుకుంటావా?"

యువకుడు కోపంతో, ఉద్రేకంతో "తల్లితో అలాంటి వ్యవహారాన్ని ఎవడు ఒప్పుకుంటాడు?" అన్నాడు.

"అవును బాబూ! ఎవరూ అలా ఇష్టపడరు. పోనీ కూతురు పట్ల అలా వ్యవహరిస్తే ఒప్పుకుంటావా?"

"అంత నీచపు పనిని ఎవరు ఎలా ఒప్పుకుంటారు?" అని అన్నాడు యువకుడు.

"పోనీ చెల్లెలుతోగాని, పిన్నమ్మతోగాని, ఇతర బంధువులతోనైనా వ్యవహరిస్తే ఒప్పుకుంటావా?" అని అడిగితే ఒప్పుకోనని యువకుడు చెప్పాడు.

ఆ యువకుడి భుజంపై చేయివేసి ప్రవక్త భగవంతుని ఇలా ప్రార్థించారు. "ఓ అల్లాహ్! ఇతను చేసిన పాపాల్ని క్షమించు. ఇతని మనసును చెడుఆలోచనలకు దూరంచెయ్యి. ఇతన్ని పవిత్రం చెయ్యి"

ప్రవక్తగారి ఉపదేశం ఆ యువకుడిపై బాగా పనిచేసింది. అతడిలో పరివర్తన కలిగింది. అప్పటి నుంచి అతడు పరస్త్రీలను కన్నెత్తియైనా చూచేవాడుకాదు.

తప్పులు అందరూ చేస్తారు ఒకరితప్పులు దిద్దాలనుకున్నపుడు లౌక్యం, ఓర్పు చాలా అవసరం అతినిదానంగా అతని తప్పు అతను తెలుసుకొనేటట్లు చెప్పాలి చెప్పేవాడి తీరునుబట్టి వినేవాడి వ్యవహారముంటుంది. మనసుకు నాటినట్లు చెబితే మనసులో పరివర్తన ప్రారింభమౌతుంది. దానవుడు మానవుడౌతాడు.

అలా చేయగలవాడు, చెప్పగలిగేవాడే మహాత్ముడౌతాడు.

---

## 5. బంగారు ఇటుకలు

రసూలుల్లాహ్ (సొ) ముగ్గురు వ్యక్తులతో కలసి వెళుతున్నారు. త్రోవలో రెండు బంగారు ఇటుకలు కనిపించాయి.

రసూలుల్లాహ్ (సొ) "ఈవస్తువులు ఏమిటి?" అని ప్రశ్నించారు

"ఇవి బంగారు ఇటుకలు."

"ఇవే ప్రపంచం. వీటివెంట ఎవరూ పోవద్దు. వీటిని కోరిన వారిని తనచుట్టూ తిప్పుకొని మోసం చేసి నాశనము చేస్తాయి. జాగ్రత్త!" అని బోధచేసి తనత్రోవన తాను వెళ్ళారు.

ప్రవక్త కళ్ళుకప్పి ఆ వ్యక్తులు ముగ్గురూ ఇటుకల్ని తీసుకొని ఒక గ్రామానికి వెళ్ళారు. వారికి ఆకలి వేసింది. వారిలో ఒకణ్ణి ఆహారం తీసుకరమ్మని బజారుకు పంపారు.

ఇక్కడున్న ఇద్దరూ "ఆహారం తేవడంతోటే వాణ్ణి కొట్టి చంపేద్దాం. ఈ రెండు ఇటుకలు చెరొకటి పంచుకుందాం" అనుకున్నారు.

బజారుకు వెళ్ళి వాడు భోజనం సంపాదించాడు. దానితోటి విషం పట్టుకొచ్చాడు. భోజనంలో విషం కలిపి ఇద్దర్నీ చంపి రెండు ఇటుకలు తాను కాజేయాలని వాడు అనుకున్నాడు.

వాడు భోజనం తెచ్చిన వెంటనే వాణ్ణి కొట్టి చంపినారు. మిగిలిన ఇద్దరూ భోజనం తిన్నారు. విషం కలిపి ఉన్నందున వాళ్ళిద్దరూ మరణించారు.

కాసేపటికి రసూలుల్లాహ్ (సొ) తిరిగివచ్చారు. చచ్చిపడి ఉన్న ముగ్గుర్నీ, వారి ప్రక్కనే ఉన్న ఇటుకల్ని చూశారు. చాలా బాధ పడ్డారు.

"హుఁ ప్రపంచం నైజమింతే! దాన్ని కోరేవారితో అది ఇలాగే ప్రవర్తిస్తుంది. ప్రపంచాన్ని ప్రేమించే వారికి ఈ లోకములోగాని, పరలోకములోగాని సుఖము లేదు



## 6. ఆకర్షణీయమైన శబ్దం

హజరత్ మూసా ప్రయాణం చేస్తున్నారు.

ఎక్కడ నుంచో "అల్లా!" అనే అకర్షణీయమైన శబ్దం వినిపించింది. ప్రవక్త ఆ ధ్వని విని అలాగే నిలబడి పోయారు.

శబ్దం ఎక్కడ నుండి వస్తున్నదో అని వెదికారు. ఎక్కడ వెదికినా తెలియలేదు.

ధ్వని కొంచెంసేపు రాలేదు. మరలా శూన్యంలో "అల్లా!" అనే ధ్వని వినిపించింది.

ఆ శబ్దం ఎటునుంచి వస్తున్నదో అని వెదికారు. ప్రయాణ మయ్యారు.

చివరకు ఒకకొండ క్రిందనుండి వస్తున్నట్లు కనుగొన్నారు.

అక్కడ ఒకమనిషి పడివున్నాడు శరీరమంతా శిధిలమైపోయి ఉంది. వళ్లంతా పురుగులుపడి ఉన్నాయి. అయినా అతడు "అల్లా! అల్లా!" అంటున్నాడు.

మూసా ప్రవక్త అతడి దగ్గరకు వెళ్ళి సలాం చేశాడు దానికి అతడు జవాబిచ్చాడు.

అతణ్ణి పరీక్షించేందుకు "ఏమోయ్ మానవుడా! శరీరమంతా పురుగులు పడినా అల్లానే స్మరిస్తున్నావు" అని అడిగారు.

"ఒకవేళ అల్లాః నాలుకమీద కూడా పురుగులను వేస్తే నేను అల్లాః పవిత్రనామాన్ని ఎలా స్మరించగలను? నాలుకనైనా కాపాడాడు కాబట్టి ఆ అల్లాఃకి ధన్యవాదాలు అర్పిస్తున్నాను" అన్నాడా వ్యక్తి

మూసా ప్రవక్త అతని అచంచల విశ్వాసానికి చలించి పోయారు. హృదయం అతనిపై ప్రేమపూర్ణమైంది.

మనకు సుఖాలనిచ్చాడు మంచి ఆరోగ్యాన్నిచ్చాడు అల్లాః. ఎప్పుడైనా ఒక చిన్న కష్టం కలిగితే అల్లాఃని నిందిస్తాం. అల్లాః ఉన్నాడా? అని సందేహిస్తాం. అంతా నశించి ఒక్క నోరుంటేనే ఎప్పుడూ అల్లాఃను స్మరిస్తున్నాడావ్యక్తి. అన్నిటినీ పొందిన మనం అల్లాఃకి ఇంకెంత ఋణపడి ఉండాలి?.

# 7. ఒక ఉత్తరం

ఇస్లాం మతవ్యాప్తికి పూర్వం నైలునది ఎండి పోయేప్పుడు ఒక అందమైన యువతిని పెళ్ళికూతురుగా అలంకరించి ఆ నదిని సంతోష పెట్టేందుకు అందులో త్రోసేవారు. ఇలా బలియిస్తే నైల్ నదికి బాగా నీళ్ళు వస్తాయని ప్రజలు నమ్మేవాళ్ళు.

తర్వాత ఈజిప్టు ముస్లింల ఆధీనంలోకి వచ్చింది. ఉమర్-ఇబ్నుల్-ఆస్ (రజి) గవర్నరుగా వచ్చారు. ఈ నరబలిని నిషేధించారు. నైల్ నదిలో నీరు తగ్గిపోజొచ్చింది. పొలాలు ఎండి పోతున్నాయి. ప్రజలు హాహాకారాలు చేయసాగారు.

ఈ పరిస్థితిచూచి గవర్నరు ఖలీఫా-ఉమర్ (రజి) కు ఉత్తరం వ్రాశారు. ఈ ఉత్తరం చేరిన తర్వాత చర్మపు ముక్కపైన ఖలీఫా జవాబు వ్రాశారు.

"ఉమర్-ఇబ్నుల్-ఆస్" (రజి) పేర!

పొగడ్తలన్నీ జగత్తును సృష్టించిన ఆ అల్లాహ్‌కే.

నీవు చాలా మంచిపని చేశావు. నరబలిని ఆపించావు. దీని వెంట మరొక ఉత్తరం పంపుతున్నాను. దాన్ని నైల్ నదిలో వేయవలసింది.

ఉత్తరం చేరడంతోనే నైలునది ఒడ్డున ప్రజల్ని సమావేశం కమ్మని చెప్పి, గవర్నరు ఖలీఫా పంపిన ఉత్తరం చదివారు.

"అమిత దయగలవాడును, ప్రేమించినవాడును అగు అల్లాహ్ పేర ముస్లిముల ఖలీఫా ఉమర్ (రజి) నుండి ఈజిప్టులోని నైలు నది పేరిట....

"ఓ నైల్ నదీ! నీవూ అల్లాః సృష్టిలోని దానవే అయితే ఒకరికి నష్టంగాని, లాభంగాని చేయడం నీ చేతిలో లేదు. ఒకవేళ నీ ఉద్దేశ్యము ప్రకారమే నడిచేదానవైతే నీవు ఆగిపో! నీతో మాకు అవసరం లేదు.

"అల్లాః ఆజ్ఞతో ప్రవహిస్తుంటే ప్రవాహంతో అలలతో ముందుకురా"

ఉత్తరాన్ని నదిలో వేసేశారు గవర్నరు.

చూస్తూ చూస్తుండగానే నదిలోకి నీరు వచ్చాయి. అలలతో వరదలతో ప్రవహించసాగింది నైల్‌నది. ఒడ్డునున్న ప్రజలు "అల్లాః చాలా గొప్పవాడు" అంటూ కేరింతలు కొట్టారు.

---

## 8. నిజాయితీగల అమ్మాయి

ఒకరోజు రాత్రి మదీనా వీధులలో ఖలీఫా ఉమర్ (రజి) తన సేవకుడైన అస్లమ్‌ను తోడు తీసుకొని తిరుగుతున్నారు.

ప్రతిరోజు రాత్రి నగర సంచారము చేసి ప్రజల మంచిచెడ్డలు తెలుసుకునేవారు.

ఆ సమయంలో ఒక ఇంట్లోనుంచి మాటలు వినిపించాయి. చెవియొగ్గి వినసాగారు ఖలీఫా.

ఆ ఇంట్లో తల్లి కూతుళ్ళు మాట్లాడుకుంటున్నారు.

"అమ్మాయ్! దూడ పాలుతాగిపోయింది. నీవు పోయి మిగిలిన పాలలో నీళ్ళు కలుపు" అని తల్లి చెప్పింది.

"పాలల్లో నీళ్ళు కలపమంటావా? నీకు తెలుసా అమ్మా! పాలల్లో నీళ్ళు కల్తీ చేయవద్దని ఖలీఫా ఆజ్ఞాపించారు. మొన్న మొన్ననే ఈ ప్రకటన చేశారు. నేను కలపనమ్మా! ఇది పచ్చిమోసం" అని కూతురు అన్నది.

"పిచ్చిదానా, ఇప్పుడెవరు చూస్తారు?. ఖలీఫా చూస్తారా! ప్రకటించే సేవకులు చూస్తారా?"

"అమ్మా! ఇదేం న్యాయమమ్మా? ముఖం యెదుట ఖలీఫా ఆజ్ఞను ఒప్పుకోవడం, అతని వెనుక తిరస్కరించడమా! ఖలీఫా చూడకపోయినా అల్లాః చూస్తున్నాడుగదా! అల్లాఃకు ఏమని సమాధానం చెప్పేది. నువ్వు కోపగించినా నేను అల్లాఃకి భయపడతానమ్మా! పాలల్లో నీళ్ళు కలపను. నీ మాటవిని నా విశ్వాసాన్ని చెడుపుకోమంటావా అమ్మా!" అని కూతురు అడిగింది.

ఖలీఫా ఈ మాటలన్నీ విన్నారు. ఆ అమ్మాయి నిజాయితీ, ధైర్యసాహసాలు, అల్లాఃపై విశ్వాసం అతనిని ఆశ్చర్యచకితుణ్ణి చేశాయి.

ఇంటికివెళ్ళి కొడుకులందరికీ ఈ జరిగిన విషయం చెప్పారు. ఆ అమ్మాయిని చాలా మెచ్చుకుంటూ "మీలో ఆ అమ్మాయిని ఎవరు పెళ్లాడుతారు? అటువంటి అమ్మాయికి కలిగే సంతానము ఉన్నతమైన గుణాలు కలిగి ఉంటుంది

ఈ మాటలు విని ఖలీఫా కుమారుడైన అసిమ్ లేచి తాను పెళ్లి చేసుకుంటానన్నాడు.

మరుసటి రోజు ఆ అమ్మాయిని పిలిపించి, అసిమ్‌కిచ్చి పెళ్లి చేశారు ఖలీఫా.

# 9. విముక్తి

ఖలీఫా ఉమర్ (రజి) తన అనుచరులతో అడవిలో వెళ్లుతూ వున్నారు. చీకటి పడింది. అడవిలో ఒకచోట విడిది చేశారు.

అక్కడ ఒక బానిస గొఱ్ఱెల్ని మేపుతున్నాడు.

అతణ్ణి పిలిచి ఖలీఫా ఒక గొఱ్ఱెని ఇమ్మన్నారు.

"మా యజమానికి తెలియకుండా నేనెలా ఇచ్చేది?" అన్నాడు వాడు.

"మేపుతుంటే తోడేలు తినేసింది అని చెప్పరా మీ యజమానితో" వాణ్ణి పరీక్షించేందుకు అన్నారు ఖలీఫా.

"యజమాని నమ్మితే నమ్మవచ్చుగాని పైన అల్లాః ఉన్నాడు గదా! నా మాట అబద్ధమని ఆ అల్లాఃకు తెలియదా?"

ఆ బానిసలోని అచంచలమైన విశ్వాసానికి ఆశ్చర్యపోయారు ఖలీఫా.

అతడి యజమాని వద్దకు వెళ్ళి అతడు కోరిన పైకమిచ్చి బానిసను విడుదల చేశారు ఖలీఫా.

"అల్లాః మీద నీవు చూపిన విశ్వాసం వలననే నీకు యిక్కడ బానిసత్వం నుండి విముక్తి కలిగింది. ఈ విశ్వాసంతోనే నీవు జీవితమంతా గడిపితే పరలోకంలో కూడా నీకు నరకము నుండి విముక్తి లభిస్తుంది. ఈ మాటలు గుర్తుంచుకో!" అని చెప్పిపంపారు ఖలీఫా.

# 10. పండుగ

ఖలీఫా ఉమర్-బీన్-అబ్దుల్ అజీజ్ (రజి) సభనుండి తన భవనానికి వస్తున్నారు.

'చంద్రుడు కనుపించాడు, కాబట్టి మరుసటిరోజు పండుగ' అనే ప్రకటన వినిపించింది.

భవనం చేరేసరికి ఎదురు వచ్చి తన చిన్న కుమారుడు ఏడుస్తూ "నాన్నా! రేపుదయం పండుగైనా మాకు కొత్త బట్టలు ఇవ్వకుండా ఇవే ఉతికి తొడుక్కోమంటున్నది అమ్మ. పిల్లలందరూ కొత్తకొత్త దుస్తులు వేసుకొని ఈద్గాహ్‌కు వెళ్లుతారు. ఈ చిరిగిన పాత దుస్తులతోటి రావాలంటే మాకు సిగ్గుగా ఉంటుంది. మేము రాము" అన్నాడు.

ఈ మాటలు చెప్పి, పిల్లవాడు ఏడుస్తూ తల్లి కాళ్లను చుట్టి వేశాడు. వాడి ఏడుపుచూసి తల్లికి కూడా దుఃఖము కలిగింది.

'ఎందుకు ఏడుస్తావు? నీకు కూడా కొత్త గుడ్డలు తెప్పిస్తాము.

పిల్లలందరూ ఈ మాటలకు సంతోషించారు. ఆనందంతో కేరింతలు కొట్టారు.

ఖలీఫా భార్య ఫాతిమా మహారాజా! మన పిల్లలకు కొత్త బట్టలు తెప్పించండి. ఖలీఫా బిడ్డలు కదా! పాత గుడ్డలు తొడుక్కొని వెళ్ళితే ఏం బాగుంటుంది?" అని అడిగింది.

"ఫాతిమా! నా జీతం చాలా తక్కువకదా అది కేవలము రొట్టె ముక్కలకు సరిపోతుంది. ఆ జీతములో కొత్త గుడ్డలెలా వస్తాయి? నీ దగ్గరేమైనా పైకముంటే కొత్త దుస్తులు కుట్టించు" అన్నారు ఖలీఫా.

"మహారాజా! నావద్ద ఒక్క మెట్టె కూడా లేదు. మీరు పరిపాలనకు వచ్చిన తర్వాత నా నగలన్నీ, నా తండ్రి జ్ఞాపకార్థం ఇచ్చిన విలువైన హారం కూడా, కోశాగారానికి ఇచ్చేశారు. నాదగ్గర ఇంకేమి ఉంటుంది? మీకు తెలియకుండా, నేనేమి దాచిపెట్టుకుంటాను?" అని అన్నది ఫాతిమా.

ఖలీఫా కొద్దిసేపు తలవంచి ఆలోచించారు. కోశాధికారికి 'ఒక నెలజీతం ముందుగా ఇమ్మని' ఉత్తరం వ్రాసి సేవకునిచేత పంపారు'

కొద్దిసేపు తర్వాత సేవకుడు అదే ఉత్తరం తీసుకవచ్చాడు. దాని వెనుక "మహారాజా! మీ ఆజ్ఞ శిరోధార్యమే. కాని మీరు ఒక నెల జీతం ముందుగా ఇమ్మన్నారు. ఒక నెల వరకు మీరు బ్రతికి ఉంటారని ఎవరు పూచీ యివ్వగలరు?" అని వ్రాసి కోశాధికారి పంపాడు.

ఆ ఉత్తరం చూచి రాజు కంటనీరు పెట్టారు. కోశాధికారి మంచి పని చేశాడు. ఒకవేళ నేను ఈలోగా చనిపోతే, ప్రభుత్వానికి బాకీ పడి ఉండేవాడిని. దీని ఫలితం పరలోకంలో అనుభవించవలసి వచ్చేది. నన్ను ఆ ఆపద నుండి రక్షించిన కోశాధికారిని అల్లాః రక్షిస్తాడు" అని అనుకున్నారు ఖలీఫా.

మరుసటి రోజు నగరంలోని పిల్లలు, పెద్దలూ అందరూ కొత్త దుస్తులు వేసుకొని వెళ్తున్నారు. ఖలీఫా, పిల్లలు పాత దుస్తులే వేసుకొని వెళ్తున్నారు. కాని అందరూ ఆనందంగానే వెళ్లుతున్నారు ఎందుకంటే ఖలీఫా ముందురాత్రే పిల్లలకు చెప్పారు. "ఈ లోకంలో పాత దుస్తులతో వెళ్తె, పరలోకంలో కొత్త దుస్తులతో ఎప్పుడూ ఉండవచ్చునని".

# 11. అన్నదాత ఔదార్యం

హజరత్ ఇబ్రహీం ప్రవక్త ఆచార పరాయణుడైన గృహస్థు. అతిథి లేకుండా భోజనము చేయు అలవాటు ఆయనకు లేదు.

చాలా దినముల వరకు ఇబ్రహీం (అలె) గారి ఇంటికి ఏ అతిథి రాలేదు. అతిథి కొరకు ఊరంతా తిరిగారు.

ఊరి బయట కొంతదూరంలో ఎముకల గూడులాంటి మనిషి కనిపించాడు. అతని తల వెంట్రుకలు, గడ్డము నెరిసి ఉన్నాయి. వంగిపోయి వంగిపోయి అడుగులో అడుగు వేస్తూ నెమ్మదిగా నీరసంగా నడచి వచ్చే ఆకారాన్ని చూచారు. అతనికి సుమారు రెండువందల వత్సరముల వయస్సు ఉన్నట్లుంది.

ఇబ్రహీం (అలె) సంతోషముతో అతని చెంతకు వెళ్ళారు. అతనిని అతిథిగా తన యింటికి ఆహ్వానించారు.

ఇంటిలో దస్తరుఖాన్‌ను పరచి భోజన పదార్థములన్నింటిని ఉంచారు.

ఇంటిలోని వారందరూ ఏక పంక్తిన కూర్చొని 'బిస్మిల్లాః' అంటూ భోజనం చేయసాగారు.

అతిథి 'బిస్మిల్లాః' అనకుండా తినసాగారు.

అదిచూచి నీవు 'బిస్మిల్లాః' అనకుండా ఎందుకు తింటున్నావు? అని ఇబ్రహీం (అలె) ప్రశ్నించారు.

'బిస్మిల్లాః' ఏ వస్తువుపేరో నాకు తెలియదు. నేను యిప్పటి వరకు వినియుండలేదు. అని అతిథి పలికాడు.

ఆ మాటలకు ఇబ్రహీం (అలె) ఆగ్రహించి అతనిని ఇంటి నుండి తరిమివేశారు.

అప్పుడు దేవదూతయైన జిబ్రాయిల్ ద్వారా అల్లాః తన ఆజ్ఞను వినిపించారు.

'ఓ ఇబ్రహీం! నేనెవరో తెలియని ఆ ముసలివానికి రెండు వందల సంవత్సరముల నుండి భోజనం పెట్టుచున్నాను. ఒక్క పూట కూడా అతనిని ఆకలితో ఉంచలేదు. కాని నీవు కొద్ది సమయంలోనే అసహనంతో, ఆగ్రహంతో భోజనము నుండి లేపి పంపావు.

ఈ మాటలు విని ఇబ్రహీం (అలె) నిశ్చేష్టుడై వలవల ఏడుస్తూ ఆ ముసలి అతిధి కొరకు పరుగులు తీశారు. ఆ అతిధి ఎక్కడా దొరకలేదు.

ఇబ్రహీం (అలె) పశ్చాత్తాపంతో చాలా సంవత్సరములు కుమిలిపోయారు.

## 12. పుణ్య కార్యాలు

హజరత్ మహమ్మద్ (సొ) తవ సహచరులకు ఇలా చెప్పారు.

ముగ్గురు యాత్రికులు ప్రయాణము చేస్తున్నారు. ఒక కొండను చేరారు. చీకటి పడింది, ఒక గుహ కనుపించింది. ఆ గుహలోకి వెళ్ళి పడుకున్నారు.

విధివశాత్తు కొండపైనుండి ఒక పెద్ద బండవచ్చి ద్వారంపైబడి గుహను మూసివేసింది. ముగ్గురూ లేచి చూచేసరికి బయటకు వెళ్ళే త్రోవ మూసివేయబడింది. బయటపడలేమని నిరాశ చెందారు.

ఏ త్రోవ లేనప్పుడు అల్లాః జ్ఞప్తికి వస్తాడు. అల్లాఃను తలచుకున్నారు తామేదైనా జీవితంలో మంచిపని చేసి ఉంటే అల్లాః

కరుణిస్తాడని భావించారు. తాము చేసిన మంచి పనులేమిటా అని ఒక్కొక్కరే చెప్పుకోవడం మొదలుపెట్టారు.

మొదటివాడు :- "ప్రపంచాన్ని సృష్టించిన ఓ అల్లాః నీకు బాగా తెలుసు. ముసలివారైన నా తల్లిదండ్రులను ఎంత శ్రద్ధతో భక్తితో చూశానో! ప్రతిరోజు పొలానికి పోయివచ్చి తలిదండ్రులకు పాలు యిచ్చి తర్వాత భార్యా బిడ్డలకు ఇచ్చేవాణ్ణి. ఒకరోజు పొలం నుండి వచ్చేసరికి ఆలస్యమైంది. తలిదండ్రులు నిద్రపోతున్నారు వాళ్ళకు నిద్రాభంగ మవుతుందని వారిని లేపక ఎప్పుడు లేస్తే అప్పుడు ఇద్దామని పాలలోటా పట్టుకొని తలగడ వద్ద నిలుచున్నాను. వారు లేవలేదు. పిల్లలు పాలకోసం ఏడుస్తున్నారు. తలిదండ్రులకు ఇవ్వందే పిల్లలకు యివ్వడం ఇష్టంలేదు. అలా ఏడుస్తూనే పిల్లలు నిద్రపోయారు. తెల్లవారి తలిదండ్రులు నిద్ర లేచేంతవరకు నేనలాగే లోటా పట్టుకొని నిలబడివున్నాను. తెల్లవారిన తర్వాత తలిదండ్రులు నిద్రలేచి పాలు త్రాగారు. తర్వాత భార్యాబిడ్డలకు పాలు ఇచ్చాను. ఓ అల్లాః! ఈపని నీకు ప్రియమైందని నీ మెప్పుకోసమే చేశాను. ఇది పుణ్యకార్యమే అయితే ఈ బండ తొలగి మాకు త్రోవ యివ్వాలి.

కొద్దిగా బండ తొలగింది. కొంచెం గాలి, వెలుతురు లోపలికి వచ్చాయి. కాని వాళ్ళు బయటకు వెళ్ళే వీలు పూర్తిగా ఏర్పడలేదు.

అప్పుడు రెండవ వాడిలా అన్నాడు :- "ఓ అల్లాః! నీకు తెలుసు మా చిన్నాయన కూతుర్ని నేను ప్రేమించాను. ఆ అమ్మాయి చాలా అందంగా ఉండేది. ఒక పర్యాయం ఆ అమ్మాయికి నా కోరిక చెప్పాను. ఆ అమ్మాయి తిరస్కరించింది. కొంత కాలానికి కరువు వచ్చింది. ఆ అమ్మాయివాళ్లు తిండిదొరకక్క నానా అవస్థ

పడుతున్నారు. అప్పుడు నేను రూ 120/-లు యిచ్చి నా కోరిక తీర్చమని అడిగాను. ఆ అమ్మాయి నచ్చింది, కాని "ఇది అవినీతి పని, ఇలా నన్ను చెరిపితే అల్లాః ఊరుకోడు" అన్నది. వెంటనే నేను ఆ అమ్మాయిని వదలి, ఆ పైకం తిరిగి తీసుకొనక ఇచ్చి వెళ్ళి పొమ్మన్నాను. అల్లాః! నీపై పూర్తి విశ్వాసం ఉన్నందున నీ పేరు చెప్పగనే వదలివేశాను. ఇది మంచిపని అయితే బండ అడ్డుతొలగి మాకు త్రోవ ఏర్పడలేదు.

అన్నట్టుగానే బండ ఇంకాకొంచెం తొలగింది. కాని బయటకు వెళ్ళేంత త్రోవ ఏర్పడలేదు.

అప్పుడు మూడవవాడు ఇలా అన్నాడు :- "ఓ అల్లాః! నేను ఒకసారి పనిచేయిస్తూ కొందరు కూలీలను పెట్టాను. ఒక్కొక్కరికి కొన్ని బియ్యం యిస్తానని చెప్పాను. అందరికి యిచ్చాను కాని ఒకడు తర్వాత వస్తానని, బియ్యం తీసుకోకుండా వెళ్ళాడు ఆ బియ్యాన్ని వేరే పనులకు ఉపయోగిస్తూ చాల సంపాదించాడు ఆ బియ్యం పెట్టుబడితో క్రమేణ పశువులు చాలాకొన్నాను చాలా కాలం తర్వాత ఆ కూలివాడు వచ్చి తన బియ్యం తనకిమ్మన్నాడు. పశువులన్నీ అతనివేనని, అతణ్ణి తీసుకపొమ్మన్నాను. అతడు ఆశ్చర్యపోయాడు. అతనికి జరిగిన విషయం వివరించి చెప్పి, వస్తువులన్నింటిని యిచ్చి పంపాను. ఈ పని నీకు ప్రియమైనదని ఇలా చేస్తే నీవు మెచ్చుకుంటావని చేశాను. నేను చేసింది పుణ్య కార్యమైతే బండరాయి పూర్తిగా వీడిపోయి మాకు బయటకు వెళ్ళేందుకు త్రోవ నివ్వాలి."

ఈ మాటలతో బండ తొలగిపోయి, వాళ్ళు బయటకు వెళ్ళేందుకు త్రోవ ఏర్పడింది.

వాళ్ళు ముగ్గురూ గుహనుండి బయటపడి వెళ్ళారు.

# 13. దానము

ఖలీఫా ఒకరోజు తన అనుచరులలో ఒకణ్ణి చూసి, "ఇతడు కొద్ది సేపట్లో మరణిస్తాడు" అని అన్నారు.

అందరూ పొలానికి వెళ్లారు. చాలా సేపైన తర్వాత తిరిగి వచ్చారు. ఖలీఫా మరణిస్తాడని చెప్పిన వ్యక్తి మరణించలేదు. బాగానే ఉన్నాడు.

ఖలీఫాను "మీరు కొద్ది సేపట్లో అతడు మరణిస్తాడని అన్నారు. ఇంకా చావలేదు" అన్నారు.

ఖలీఫా ఆ వ్యక్తిని "నీవు ఈలోగా పుణ్యకార్యము ఏమైనా చేశావా"? అన్నారు.

నేను మాత్రం ఏమీ చేయలేదు నేను కట్టెలు కొట్టేందుకు అడవికి వెళ్ళాను. రొట్టెలు మూటకట్టుకొని వెళ్ళాను. అక్కడ ఒక పేదవాడు ఆకలితో అలమటిస్తూ 'తినేందుకు ఏమైనా యివ్వు. నిన్ను అల్లాః కాపాడుతాడు' అన్నాడు. నా వద్ద ఉన్న రొట్టె అతనికి యిచ్చాను.

ఖలీఫా అతడి కట్టెల మోపును విప్పమన్నారు. విప్పేసరికి నల్లత్రాచు, పడగవిప్పి ఆడుతూ అడవిలోకి పారిపోయింది.

అప్పుడు ఖలీఫా ఇదిగో నల్లత్రాచు కాటుతో చావవలసినవాడు కాని రొట్టెయిచ్చి పేదవాణ్ణి రక్షించినందున ఇతణ్ణి త్రాచు కరప లేదు. ఇతడు బ్రతికిపోయాడు అని చెప్పారు.

దానం వరదానం వంటిది. దేవుని ఆగ్రహాన్ని తొలగిస్తుంది. దుర్మరణాల నుండి జనాన్ని కాపాడుతుంది.

# 14. గురువు

ఖలీఫా హరునుర్ రషీద్ కాలంలో అస్మయి అనే గొప్ప విద్వాంసుడున్నాడు. ఖలీఫా తనకుమారులు అమీన్, మామూన్‌లకు ఆ గురువువద్ద చదువు నేర్పించ దలచినారు. అస్మయిని తన వద్దకు రమ్మని భటులచే కబురు పంపారు.

అస్మయి ఆత్మాభిమానం కలవారు. "ఖలీఫాగారూ! నా అవసరమైతే నేను తమవద్దకు వస్తాను. కాని చదువు దర్బారుకు రాదు. తమ పిల్లలకు నాచేత చదువు చెప్పించదలచితే, వారిని నావద్దకు పంపండి. నాయింటివద్ద వారికి చదువు చెబుతాను" అని చెప్పి పంపారు.

ఖలీఫా తన తప్పు తెలుసుకొని పిల్లలను గురువుగారి ఆశ్రమానికి పంపినారు. అక్కడ ఆసనాలు లేవు. గురువుగారు క్రింద చాపమీద కూర్చొని, రాకుమారులను కూడా అక్కడే కూర్చోమన్నారు. అలాగే అక్కడే కూర్చొని వారు శ్రద్ధగా విద్య నేర్చుకోసాగారు. రాకుమారులపట్ల గురువు ప్రేమ చూపేవారు. ఆ పిల్లలు గురువుపట్ల భక్తి గౌరవాలు చూపేవారు. ఇలా కొంతకాలము గడిచింది.

ఒకరోజు గురువు తన విద్యార్థుల్ని పరీక్షించ దలచారు "నాయనా! ఆ వాకిటవద్ద చెప్పులు సరిగాపెట్టు" అన్నారు. ఇద్దరు రాకుమారులు చెప్పులు సర్దేందుకు పరుగెట్టారు. 'గురువుగారు నా వైపు చూచి చెప్పారు. కాబట్టి నేను సర్దుతాను' అని పెద్దవాడు అన్నాడు.

'కాదు నావైపు చూచి చెప్పారు. నేను సర్దుతాను' అని చిన్నవాడు ముందుకు వచ్చాడు.

ఇద్దరూ నేనంటే నేనని వాదులాడుకున్నారు. ఆఖరుకు ఒక్కొక్కరు ఒక్కొక్క చెప్పును సర్దినారు.

తర్వాత ఒకరోజు ఖలీఫా గురువుగారిని దర్బారుకు ఆహ్వానించారు ఆహ్వానాన్ని మన్నించి అస్మయీ పండితుడు దర్బారుకు వచ్చారు.

ఖలీఫా అతనికి ఒక ఉన్నతాసనం ఇచ్చి సగౌరవముగా కూర్చోమని ప్రార్థించారు. చిరునవ్వు నవ్వుతూ అస్మయీ ఆసనం మీద కూర్చున్నారు.

'ప్రపంచములో అందరికంటే గౌరవనీయుడెవరు?' అని సవినయంగా అస్మయీని ప్రశ్నించారు ఖలీఫా.

"లోక పాలకుడైన అల్లాః ఒకడే అందరికీ గౌరవనీయుడు మహరాజా! తమకంటే గౌరవనీయుడు ఎవడూ లేడు. తమవద్ద అన్ని వైభవాలున్నాయి. ప్రజలంతా తమరిని భక్తిశ్రద్ధలతో ఆరాధిస్తు ఉంటారు. అన్ని దేశాలవారూ తమపట్ల విధేయత చూపుతున్నారు. తమరుగాక మరెవరు?" అన్నారు అస్మయీ.

'నేనుకాదు నాకంటే అందరికంటే పూజనీయుడొకడున్నాడు. ఎవరి చెప్పులు సర్దేందుకు రాజకుమారులె పోటీపడ్డారో అతడు నాకంటే గౌరవనీయుడు కాదా?' అన్నాడు రాజు

కాని ప్రస్తుత ప్రపంచంలో.

అవును! గురువుగారి స్థానం అత్యున్నతమైంది. మాతాపితల తర్వాత గురువు పూజ్యనీయుడు. జన్మనిచ్చేది తలి దండ్రులైతే ప్రయోజకుణ్ణి చేసి, విజ్ఞానవంతుల్ని చేసేవాడు గురువు. పశువు నుండి మనిషిని; మనిషి నుండి మనీషిని చేసేవాడు గురువు.

# 15. అల్లాహ్‌పై నమ్మకం

ప్రవక్త సులేమాన్ (అ) కు అన్ని ప్రాణుల భాషలూ తెలుసు. ఒకరోజు త్రోవన వెళ్తుంటే ఒక చీమ కనుపించింది.

"నీవు ఎంత ఆహారము తీసుకుంటావు?" అని అడిగారు.

"సంవత్సరానికి ఒక గోధుమ గింజ తింటాను" అని చెప్పింది చీమ.

ఆ చీమను ఒక జాడీలో వేసి ఒక గోధుమగింజ అందులో వేసి మూసివేశారు సులేమాన్ (అ).

సంవత్సరం తర్వాత జాడీ తెరచి చూస్తే సగం గోధుమ గింజ మాత్రమే తిన్నది చీమ.

"నువ్వు ఒక గోధుమ గింజ తింటానన్నావు సంవత్సరానికి. మరి సగం మాత్రమే తిన్నావేమి?" అని అడిగారు.

'మహాత్మా! నేను దైవాన్ని నమ్మినదాన్ని. కాని నీవు మానవుడివి. నీవు నన్ను జాడీలో మూసిపెట్టావు. సంవత్సరం తర్వాత నీవు మూత తెరువకపోతే, నాకు ఆహారం యివ్వకపోతే నాగతేం కాను అందుకని సగం మిగుల్చుకున్నాను. దైవాధీనంలో ఉన్నట్లయితే మొత్తం తిని ఉండేదాన్ని" అని జవాబు చెప్పింది.

ఆ జవాబు విని మనుషులకేకాదు, దేవునిపై అన్ని ప్రాణులకీ నమ్మకం ఉంటుంది అని అనుకున్నారు సులేమాన్ (అ).



# 16. ప్రజా సేవ

హజరత్ ఉమర్ ఖలీఫా ప్రజల యోగక్షేమాలు తెలుసుకొనేందుకు, కష్టాల్లో ఉండేవారిని ఆదుకునేందుకు రాజ్యమంతా సంచారము చేసేవారు.

ఒక రాత్రి ఉమర్ ఖలీఫా తన గులాం అస్లమ్‌ను తీసుకొని మదీనా పట్టణం దాటివెళ్ళారు. దూరంగా ఒక డేరా కనుపించింది. ఆ డేరా దగ్గరకు వెళ్ళారు. విచారంగా డేరా బయట ఒక మనిషి కూర్చుని ఉండడం చూశారు. డేరా లోపలి నుండి బాధతోకూడిన కేకలు వినిపిస్తున్నాయి.

"లోపల ఎవరున్నారు? ఎవరు కేకలు వేస్తున్నది?" అని బయట కూర్చున్న మనిషిని అడిగారు ఖలీఫా.

"లోపల నా భార్య ప్రసవవేదన పడుతుంది కాన్పు చేసేందుకు ఏ స్త్రీ లేదు. ఏ పరికరాలు లేవు. అందుకని నేను చింతిస్తున్నాను" అన్నాడు బద్దూ.

ఖలీఫా వెంటనే తన యింటికి వెళ్ళారు. తన భార్యతో "బేగం సాహెబా! మనకు పుణ్యం సంపాదించుకునేందుకు ఒక బంగారు అవకాశం వచ్చింది. నీవు కూడా నా వెంటవచ్చి సహకరిస్తే ఆపదలో ఉండే ఒకర్ని ఆదుకోవచ్చు" అని చెప్పి ఆ గర్భిణీ పరిస్థితి వివరించారు.

బేగమ్ వెంటనే కాన్పుకు కావలసిన సరంజామా తీసుకొని ఖలీఫా వెంట వచ్చింది. ఆలస్యం చేయకుండా ఇరువురూ ఆ డేరా

వద్దకు వచ్చారు. బేగమ్ లోపలికి వెళ్ళి, ఆ గర్భిణీ స్త్రీకి పరిచర్యలు చేసింది. సుఖప్రసవం అయింది మగపిల్లవాడు పుట్టాడు.

బేగమ్ వెంటనే 'ఖలీఫా! మీ మిత్రుడికి మగపిల్లవాడు పుట్టాడు' అని సంబరముతో చెప్పింది.

అంతవరకు ఆ వచ్చినవాడు ఖలీఫా అని లోపల పురుడు పోసింది రాణి అని తెలియదు ఆ బద్దూకు.

రాణి మాటలు వినడంతోటే దిగ్భ్రమచెంది, తన ఎదుట ఉన్న ఖలీఫా పాదాల మీద పడ్డాడు.

ఖలీఫా అతనిని లేవదీసి "ప్రజాసేవ చేసేవాడే ఖలీఫా, కష్టాల్లో ఉండేవాళ్ళను ఆదుకోకుంటే నా రాజపదవి ఎందుకు, రాజ్యమెందుకు?" అన్నాడు.

---

## 17. యజమానికి ఉపదేశం

ఒకప్పుడు లుక్మాన్ హకీమ్ ఒక భూస్వామి వద్ద బానిసగా పనిచేయవలసి వచ్చింది. భూస్వామి చాలా పాపాత్ముడు కఠినాత్ముడు.

హకీమ్ అతనికి మంచి ఉపదేశం ఇవ్వాలని అనుకున్నాడు. కాని మాటలతో చెప్పితే అతడు వినడు, ఆచరించడు. అందుకొని మంచి అవకాశం కోసం కాచుకొని ఉన్నాడు.

ఒకరోజు భూస్వామి తన చేలో గోధుమ విత్తనాలు చల్లమని హకీమ్‌కు చెప్పాడు.

కాని హకీమ్ జౌలు తీసుకవెళ్లి చల్లివచ్చాడు. భూస్వామికి వెళ్ళిచూసే అవకాశం లేకపోయింది.

కొన్నాళ్ళకు మొక్కలు పెరిగి, పంటకు సిద్ధమైంది అప్పుడు వెళ్ళి యజమాని చూచి నిర్ఘాంతపోయాడు.

తాను చల్లమన్నది గోధుమలు, కాని చల్లినది జౌలు. కోపమొచ్చింది. హకీమ్‌ను పిలిచాడు.

'ఏమోయ్! నేను గోధుమలు చల్లమన్నానుగదా!' అన్నాడు.

'అవును '

'మీరు గోధుమలే చల్లమన్నారు. కాని జౌలు చల్లినా కోసుకునేప్పుడు గోధుమలు కోసుకోవచ్చు అనుకున్నాను అని హకీమ్ అన్నాడు.

యజమానికి మరింత కోపమొచ్చింది "అదెలా సాధ్య మౌతుందనుకున్నావు? నువ్వు ఇంత తెలివితక్కువవాడివా? జౌలు చల్లి గోధుమలు కోసుకోవడం వీలవుతుందా"? అన్నాడు.

అతనికి ఉపదేశం చేసే అవకాశం దొరికింది హకీమ్‌కు. "అయ్యా! మీ ప్రవర్తనను చూచే నేర్చుకున్నాను. మీరెప్పుడూ పాపపు పనులు చేస్తుంటారు. కాని అల్లాః రక్షిస్తాడని అంటుంటారు. పాపాలు చేసి పుణ్యం వస్తుందని అనుకున్నప్పుడు జౌలు వేసి గోధుమలు కోసుకోవాలని ఎందుకు అనుకోకూడదు?" అని సమాధాన మిచ్చాడు హకీమ్.

* జౌలు — ఒక రకమైన ధాన్యం.

## 18. మంచి - చెడు

లుక్‌మాన్ హకీమ్ బానిసగా ఉన్నాడు.

ఒకరోజు యజమాని ఒక పొట్టేలును కోసి, దాని మాంసంలో అతి మంచి భాగాలు తెమ్మన్నాడు.

హకీమ్ నాలుక, గుండెలను తీసుకవెళ్ళి యిచ్చాడు.

కొద్దిరోజుల తర్వాత మరల ఒక పొట్టేలుకోసి, దానిమాంసంలో అతి చెడ్డభాగాలు తీసుక రమ్మన్నారు.

హకీమ్ మరల నాలుక, గుండెలను తీసుకవెళ్లాడు.

వాటినిచూచి యజమాని "ఏమయ్యా! నేను మంచివి తెమ్మన్నా గుండె, నాలుకల్ని తెచ్చావు. చెడ్డవి తెమ్మన్నా వాటినే తెచ్చావు. కారణమేమిటి?" అని అడిగాడు.

"అయ్యా! మనిషి మంచిగా ప్రవర్తిస్తే నాలుక, గుండెలు అతి మంచివిగా ఉంటాయి. అంతకు మించిన మంచి భాగాలు మరి లేవు. అదే చెడుగా ప్రవర్తిస్తే ఆ గుండె, నాలుకలే అతి చెడ్డవై పోతాయి. వాటిని మించిన చెడ్డవి మరి ప్రపంచంలో లేవు కాబట్టి మంచివైనా, చెడ్డవైనా అవే. మనిషి ప్రవర్తించే తీరునుబట్టి అవి ఉంటాయి." అని హకీమ్ చెప్పాడు.



## 19. న్యాయం

స్పెయిన్ ఖలీఫా అల్‌హకమ్ ఒక పెద్ద భవనం నిర్మిస్తున్నారు, ఆ నిర్మాణం ప్రక్కనే ఒక పేద విధవరాలి స్థలము ఉంది. ఆ స్థలం కూడా కలుపుకుని నిర్మిస్తే ఆ భవనం చాలా అందముగా. విశాలంగా ఉంటుందని భావించారు.

ఆ విధవరాలును పిలిపించారు. ధనాశ చూపారు ఆమె అమ్మదలచలేదు. ఆమె కోరినంత ధనం ఇస్తామన్నారు. ఆ స్థలాన్ని ఆమె అమ్మనంటే అమ్మనన్నది.

ఖలీఫాకు కోపం వచ్చింది. బలవంతాన స్థలాన్ని ఆక్రమించేశారు

భవన నిర్మాణం కొనసాగింది అతి రమణీయంగా భవనం తయారయింది.

పాపం పేదరాలు కాజీ (న్యాయాధిపతి) దగ్గరకు వెళ్ళి మొర పెట్టుకుంది. కాజీ ఆమె నిస్సహాయస్థితికి జాలిపడ్డాడు, కాని కాజీ మాత్రం ఏమిచెయ్యగలడు? ఖలీఫాతో పని. అతన్ని దోషిగా నిలబెట్టగలడా? ఆలోచించాడు.

భవనం పూర్తయిన తర్వాత ఖలీఫా చూడడానికి కాజీనికూడా రమ్మన్నారు. కాజీ ఒక గాడిదను, ఒక ఖాళీ గోతాన్ని తీసుకొని వెళ్ళాడు.

ఇద్దరూ భవనాన్ని చూశారు.

తర్వాత మెల్లగా కాజీ "ఖలీఫాగారూ! ఈ స్థలంలోని మట్టి ఒక బస్తాడు కావాలి" అని అడిగాడు.

ఖలీఫా తీసుకోమన్నాడు

కాజీ బస్తానిండా మట్టి కూరాడు. ఆ బస్తాను గాడిద మీద పెట్టాలి. ఒక్కడే మొయ్యలేక పోయాడు. ఖలీఫాను సాయం పట్టమన్నాడు. ఇద్దరూ అతి ప్రయాసతో ఆ బస్తాను గాడిద మీద పెట్టలేకపోయారు. ఇద్దరికీ చెమటలు పట్టాయి. అలసిపోయారు.

అప్పుడు ఖాజీ "ఖలీఫాగారూ! ఈ మట్టిమూట ఎత్తేందుకు ఇంత అవస్థ పడ్డామే. రేపు ఈ విధవరాలు తన స్థలం మీరు స్వాధీనం చేసుకున్నారని అల్లాః ముందు ఫిర్యాదు చేస్తే, అపుడు మీరు జవాబు చెప్పుకోవలసి వస్తుంది. అంత పాపభారాన్ని ఎలా మోయగలరు? అల్లాః కేమని జవాబు చెప్పుకుంటారు? అని అన్నాడు

ఖలీఫాకు తాను చేసిన తప్పు తెలిసివచ్చింది. బాధపడ్డారు. భవనం కట్టేశాడు. ఆమె స్థలం ఆమెకు ఎలా ఇవ్వగలడు? అందుకని ఆమె స్థలంపై కట్టిన మేరకు భవనాన్ని ఆమెకు ఇచ్చివేశాడు.

## 20. ముగ్గురు మిత్రులు

ఒకతనికి ముగ్గురు మిత్రులున్నారు.

ఆ వ్యక్తి మరణశయ్యమీద ఉన్నాడు. తన ముగ్గురు మిత్రులను పిలిపించాడు. "నేను అంతిమ ఘడియల్లో ఉన్నాను. ఈ కష్ట సమయంలో నీవేమి సహాయం చేయగలవు?" అని మొదటి మిత్రుణ్ణి అడిగాడు.

"నేను జీవితమంతా సహాయం చేశాను. ఇప్పుడేమీ చేయలేను" అని ఆ మిత్రుడన్నాడు.

రెండవ మిత్రుని పిలిచి 'నీవైనా సహాయము చెయ్యి' అన్నాడు.

అతడు "నీవు చనిపోతే స్నానం చేయించి, గుడ్డ కప్పి (కఫన్) సువాసన ద్రవ్యాలు పూసి, పాడెను తీసుకవెళ్ళి మంచి ప్రదేశంలో

గోరీ కట్టి, పూలు చల్లుతాను. ఇంతకు మించి నేనేమి చేయలేను" అన్నాడు.

మూడవ మిత్రుణ్ణి పిలిచి "ఈ కష్ట సమయంలో నీవేమి చేయగలవు?" అని అడిగాడు.

అతడు "నీవేమీ చింతించవద్దు. నిరాశపడవద్దు. నేను మీ వెంటనే ఎప్పుడూ ఉంటాను. గోరిలోగాని, తర్వాత న్యాయవిచారణ సమయంలోగాని, ఎలాంటి ఆపద సమయములోగాని నీ వెంట ఉండి రక్షిస్తాను" అన్నాడు.

ఆ మాటలు విని అతడు నిశ్చింతగా చనిపోయాడు. ఇంతకూ ఆ స్నేహితులెవరో మీకు తెలుసా?

ధనం, సంతానం, సత్ప్రవర్తన.

---

# 21. మానవాన్వేషణ

మౌలానా రూమ్ తన మసనవేలో ఇలా వ్రాస్తున్నారు.

నిన్నరాత్రి ఒక ముసలివాడు దీపం తీసుకొని చుట్టూ తిరుగుతున్నాడు. ఆ చీకటిలో దేనికోసమో వెదుకుతున్నాడు.

"ఇంత చీకటిలో దేనికోసం వెదుకుతున్నావు?" అని అడిగాను.

"మనిషికోసం. ఈ పశువులు, క్రూరమృగాల మధ్య ఉంటూ విసిగిపోయాను. శాంతిని పోగొట్టుకున్నాను. నాకిపుడు మానవత్వం నిండిన మనిషి కావాలి. అటువంటి వానికోసము వెదుకుతున్నాను.

'ఓ మహానుభావా! ఈ అవసాన దశలో ఈ కోరిక కలిగిందేమిటి? నేనూ అటువంటి మనిషి కోసం జీవితమంతా వెతికి వెతికి వేసారి పోయాను. నాకు దొరకలేదు. నీకు దొరుకుతాడని నమ్మకం లేదు' అన్నాను.

"నాదో విచిత్ర ప్రకృతి. ఏది దొరకదో, ఏది దొరకడం అసంభవమో దాన్ని వెదకి సాధించడం నా అలవాటు. ఇప్పుడు మీరు దొరకదని చెప్తుంటే ఆ తప్పిపోయిన మానవుణ్ణి ఎలాగైనా వెదకి పట్టుకోవాలని కుతూహలం పెరిగింది. అటువంటి మానవుణ్ణి వెదకి పట్టుకునేంత వరకు విశ్రమించను. మానవులంతా ఒకే రకం అనుకుంటాము. కాని మీరు చెప్పినదాన్నిబట్టి మానవుల్లో రెండు రకాలున్నారని తెలిసింది. మనమందరం చూడడానికి మనుషులమే. ప్రపంచములో అంతా మనలాంటివారే దొరుకుతారు. కాని మానవత్వం నిండిన మనుషులు కావాలంటే దీపంతో వెదకాల్సిందే.

---

## 22. తల్లి ఔన్నత్యము

హజరత్ మహమ్మద్ ప్రవక్త (సొ) కాలంలో ఒక దైవభక్తుడు ఉండేవాడు. ప్రతిరోజు ఐదు పూటలు నమాజ్ చదివేవాడు. ఉపవాసాలుండేవాడు. దాన ధర్మాలు కూడా చేసేవాడు. ప్రజలంతా అతడు దైవభీతిగలవాడనీ ధర్మాత్ముడనీ కొనియాడేవారు,

ఒకరోజు అతనికి మృత్యుసమయము ఆసన్నమయింది. బంధు మిత్రులంతా మృత్యుశయ్యకి యిరుప్రక్కల చేరి దుఃఖించసాగారు.

క్షణక్షణానికి అతని పరిస్థితి దిగజారిపోతున్నది. జీవిస్తాడనే ఆశ వదలుకొని అందరూ అతని చుట్టూచేరి 'కలిమా చదువుమని ప్రాధేయ పడ్డారు. కాని ఆశ్చర్యం అతనికి 'కలిమా' చదువుటకు సాధ్యం కాలేదు. శతవిధాలా ప్రయత్నించినా నోరు తిరగడం లేదు. ఇది చూచి అందరూ నిర్విణ్ణులైనారు. దైవభీతిగలవాడు, ధర్మాత్ముడైన ఇతనికి 'కలిమా' చదువుట రాలేదెందుకు? ఎన్నడూ దైవాజ్ఞల్ని అతిక్రమించి తన జీవితాన్ని గడపలేదు! ఎవరికి అపకారము చేయలేదు. మరెందుకు కలిమా చదువలేక పోతున్నాడు? ఇతడు చేసిన పాపమేమిటి? అని పరి పరి విధాల అందరు ఆలోచించసాగారు. కాని ఎవ్వరికి విషయం అంతుపట్టలేదు

ఇదంతా చూచి ఒక వ్యక్తి హజరత్ మహమ్మద్ ప్రవక్త (సొ) వద్దకు వెళ్ళి "ఓ ప్రవక్తా (సొ) ఒక దైవభక్తుడు అవసాన దశలో పడి ఉన్నాడు". అతనితో కలిమా చదువుమని చెప్పినా చదువలేక పోతున్నాడు అని విన్నవించాడు.

"అతడు నమాజ్ చదివేవాడా?" అని ప్రవక్త (సొ) ప్రశ్నించారు. "ఔను చదివేవాడు" అని సమాధాన మిచ్చాడు. హజరత్ మహమ్మద్ ప్రవక్త (సొ) తన అనుచరులతో భక్తులు ఇంటికి వెళ్ళి అతనిని కలిమా చదువుమని ఆదేశించారు. కాని అతడు చదువలేక పోయాడు.

హజరత్ మహమ్మద్ ప్రవక్త (సొ) అందరి సమక్షంలో విచారణ జరుపగా 'అతడు తల్లి ఆజ్ఞలను శిరసావహించేవాడు కాదని' తెలిసింది. వెంటనే తల్లిని పిలిపించి ఆమె ముందు ఒక పెద్ద మంట చేసి "నీవు నీ కుమారుణ్ణి క్షమిస్తే మేము విడిచి పెడ్తాము. లేకుంటే

ఇప్పుడే అతనిని అగ్నిగుండంలో పడవేస్తాము" అని చెప్పారు. అప్పుడు తల్లి "నేను అతను చేసిన తప్పులను క్షమిస్తున్నాను" అని ఒప్పుకొన్నది.

తర్వాత హజరత్ మహమ్మద్ ప్రవక్త (సొ) ఆ దైవభక్తునితో కలిమా చదివి అల్లాః ఒక్కడేనని, నేను దైవప్రవక్తనని ధృవీకరించుము అని ఆదేశించినారు. వెంటనే అతడు స్పష్టముగా 'కలిమా' చదువసాగాడు.

అల్లాః ప్రశంసనీయుడు, ఇతనికి నరకము నుండి విముక్తి లభించింది అని ప్రవక్త (సొ) ప్రకటించారు.

ఎంత గొప్పదైవభక్తుడైనా, ఎన్ని పుణ్యకార్యాలు చేసినా తల్లిని గౌరవించనందున అవసాన దశలో కలిమా నోటినుండి వెలువడలేదు. అతడు చదివిన నమాజులు, ఉన్న ఉపవాసములు, చేసిన దాన ధర్మాలన్నీ వ్యర్థమైపోయాయి.



# 23. విధి

అలెగ్జాండరు విశ్వవిజేత కావాలని దండయాత్రకు బయలు దేరాడు. ఆఫ్రికా అడవులగుండా ప్రయాణము చేస్తూ ఒక మారుమూల గ్రామం చేరుకున్నాడు.

అలెగ్జాండరును చూచి ఆ వూరి సరదారు తమ యింటికి భోజనానికి ఆహ్వానించాడు. ఆ ఊరిలోని వారందరి నివాసము గుడిసెలలోనే. ఒక గుడిసెలోకి ప్రవేశించారు.

సర్దారు బంగారు కచౌడీలు, రొట్టెలు తెచ్చి అలెగ్జాండరు ముందుంచి తినమని కోరాడు.

అలెగ్జాండరు 'మీరు బంగారు తింటారా?' అని అడిగాడు.

తింటామని చెప్తూ 'అందరూ తినే పదార్థాలు మీ దేశంలో కూడా ఉన్నాయికదా! దేశంలో అన్నీ వున్నప్పుడు దండయాత్రలు ఎందుకు చేస్తారు? బంగారము దొరకక బంగారం తినాలని వచ్చారేమో అందుకే బంగారం మీ ముందుంచాను' అన్నాడు.

'నేను మీ బంగారం కోసం రాలేదు. మీ ఆచార వ్యవహారాలు తెలుసుకునేందుకు వచ్చాను.' అని అలెగ్జాండరు చెప్పాడు.

'అలాగైతే మీరు ఎన్ని రోజులు ఉండదలిస్తే అన్ని రోజులు ఉండండి' అన్నాడు సర్దారు.

ఈ సంభాషణ జరుగుతుండగా ఇద్దరు వ్యక్తులు గుడిసెలోకి ప్రవేశించారు.

వారిలో మొదటివాడు "సర్దారు! నేను అతనివద్ద భూమి కొన్నాను. వ్యవసాయం చేస్తున్నాను. భూమి దున్నుతుంటే ఈ నిధి దొరికింది. అతడి భూమి కాబట్టి అతణ్ణి తీసుకోమన్నాను. కాని అతడు వద్దంటున్నాడు" అన్నాడు.

రెండవవాడు 'నేనింకా అంత దిగజారలేదు. సర్దార్! భూమి అమ్మినపుడు భూమిలోని నిధినిక్షేపాలన్నీ కొన్నవాడికే చెందుతాయి. అందుకని అతడే తీసుకోవాలి. మీరెలాగైనా అతణ్ణి ఒప్పించండి. అన్నాడు.

వాళ్ళిద్దర్నీ సర్దార్ మళ్ళీ మళ్ళీ అడిగాడు. ఇద్దరూ అలాగే చెప్పారు. మొదటివాణ్ణి 'నీకు కొడుకున్నాడా?' అని అడిగాడు' ఉన్నాడన్నాడు.

రెండవవాణ్ణి 'నీకు కూతురుందా?' అనడిగాడు. ఉందన్నాడు. అయితే అతని కుమారుడికి నీ కుమార్తెనిచ్చి పెండ్లి చెయ్యి. ఆ నిధిని వారిద్దరికీ కానుకగా ఇచ్చేయండి అని తీర్పు చెప్పాడు.

వాళ్ళిద్దరూ వెళ్ళిపోయారు. అలెగ్జాండరు ఈ తీర్పు విని చాలా ఆశ్చర్యపోయాడు.

అతడి విస్మయాన్ని గమనించి సర్దార్ 'మహారాజా! నా తీర్పు అన్యాయంగా ఏమైనా ఉందా' అని అడిగాడు.

'లేదు సర్దార్! నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది' అన్నాడు.

"మహారాజా! ఇలాంటి వివాదం మీ దేశంలో వస్తే మీరెలా తీర్పిస్తారు?" అని సర్దార్ అడిగాడు.

'నిజం చెప్పాల్సి వస్తే ఆ ఇద్దర్నీ ఖైదు చేసి ఆ నిధిని రాజ కోశానికి అప్పగిస్తాము' అన్నాడు అలెగ్జాండరు.

మహారాజా! మీ దేశంలో సూర్యుడు ఉదయిస్తాడా?

ఎందుకులేదు ఉదయిస్తాడు.

అక్కడ వర్షం కురుస్తుందా?

కురవక పోవడమేమిటి తప్పక కురుస్తుంది!

సర్దారు చాలా ఆశ్చర్యంగా "అయితే మీ దేశంలో అడవుల్లో మేసే జంతువులున్నాయా!" అని అడిగాడు.

అలెగ్జాండరు అనేక రకాల జంతువులున్నాయన్నాడు.

"అయితే యిదే కారణం సూర్యుడు ప్రకాశించడం, వర్షము కురవడం ఆ అమాయిక ప్రాణుల కోసమే. దయామయుడైన అల్లాః వాటికోసం అన్నీ చేస్తున్నాడు. అవిలేకపోతే మీరు సూర్య ప్రకాశానికి వర్షానికి అర్హులే కారు" అని సర్దారు అన్నాడు.



## 24. పాప పుణ్యాలు

ఒకడు మహాక్రూరుడై 99 మందిని హత్య చేశాడు. అతడు 'అందరికంటె గొప్ప పండితుడు ఎవరు?' అని ప్రజల్ని అడిగాడు. ప్రజలు ఒక మంచి శాస్త్రజ్ఞుని పేరు చెప్పారు. ఆ హంతకుడు ఆ పండితునివద్ద కెళ్ళాడు.

"ఓ పుణ్యాత్మా! ఒకడు 99 మందిని హత్య చేశాడు. అతనిని అల్లాః క్షమిస్తాడా?" అని ప్రశ్నించాడు.

"ఓయీ అతనిని ఏనాటికి అల్లాః మన్నించడు" అన్నాడు ఆ పండితుడు.

ఆ హంతకుడు ఆ పండితుణ్ణికూడా చంపి వందమందిని పూర్తి చేశాడు.

ప్రజల దగ్గరకు పోయాడు. మరల ప్రజల్ని "గొప్ప శాస్త్రవేత్త వరు?" అని అడిగాడు.

వారు ఇంకొకరి పేరు చెప్పారు.

అతడివద్దకు వెళ్ళాడు హంతకుడు.

'నేను వందమందిని చంపాను. నాకు క్షమాపణ ఉంటుందా? అల్లాః నన్ను మన్నిస్తాడా?' అని అడిగాడు.

'అల్లాః కరుణామయుడు నిన్ను తప్పక క్షమిస్తాడు. ఇక్కడికి కొంతదూరంలో ఒక పుణ్యభూమి వుంది. అక్కడ కొందరు ఎప్పుడు అల్లాఃని ధ్యానిస్తుంటారు. వారితో కలసి నీవూ అల్లాఃని ధ్యానించు. నీవు వెంటనే అక్కడకు వెళ్ళు. ఈ పాపభూమిని వదలి వెళ్ళేటప్పుడు తిరిగి చూడవద్దు. బయలుదేరి వెళ్ళు' అని చెప్పారు.

అతడు ఆ పుణ్యభూమి వైపు ప్రయాణమయ్యాడు.

సగందారికి వచ్చేసరికి ప్రాణాలు పిడచగట్టాయి.

నడవలేక పడిపోయాడు. గుండెపట్టుకుని బాధతో కొంతదూరం దొర్లిపోయి ప్రాణాలు విడిచాడు.

అతణ్ణి తీసుకవెళ్ళేందుకు దేవదూతలు, యమకింకరులు వచ్చారు.

'ఇతడు పాపకార్యాలు వదలి దైవచింతన చేద్దామని బయలు దేరాడు కాబట్టి ఇతనిని మాలోకం తీసుకవెళ్ళుతాం' అన్నారు.

'ఇతని జీవితంలో ఒక్క మంచిపనైనా చేయలేదు. కాబట్టి మాలోకం తీసుక వెళ్ళుతాం' అన్నారు యమకింకరులు.

'క్షమాపణకోరాడు కాబట్టి మాలోకం తీసుకవెళ్ళుతాం' అన్నారు దేవదూతలు.

వీరిలా వాదులాడుకుంటున్నారు. ఇంతలో ఒకదేవదూత మానవరూపంలో ప్రత్యక్షమయ్యాడు.

రెండు పక్షాలను సమాధాన పరిచాడు.

పుణ్యభూమి, పాపభూమి మధ్యదూరాన్ని కొలవమన్నాడు. ఆ చనిపోయిన మనిషి ఏ భూమికి దగ్గరగా ఉన్నాడో నిర్ణయించమన్నాడు

ఏ భూమికి దగ్గర ఉంటే ఆ దూతలు అతణ్ణి తీసుక వెళ్ళవచ్చు అని చెప్పాడు.

దేవతలు అతనిని తమలోకం తీసుకవెళ్ళారు.

ఆ మధ్యదూరాన్ని కొలిచారు. ఆ చనిపోయిన మానవుడు పుణ్యభూమికే దగ్గరున్నాడు.

మనిషి ఒక అడుగు అల్లాః వైపు వేస్తే అల్లాః పది అడుగులు మనిషివైపువేసి అతనిని తన సన్నిధికి తీసుకుంటాడు.

---

## 25 దేవుని ద్వారం

కరువు కాటకాలు విలయతాండవమాడుతున్నాయి.

ఒక అందమైన యువతి ద్రాక్షతోటలోనికి వెళ్ళింది. ఆ తోట యజమానిని కొన్ని పండ్లు పెట్టమని అడిగింది.

ఆ యజమాని ఆమెను చూశాడు 'నీవు నాకోర్కె తీరిస్తే నీకు ద్రాక్ష ఇస్తాను. గుడ్డలు, ధనం అన్నీ ఇస్తాను' అన్నాడు.

ఆ యువతి దీనంగా చూచి సరేనన్నది.

'అయితే ఆ చుట్టూ ద్వారాలు మూసిరా' అన్నాడు.

ఆ యువతి ద్వారాలన్నీ మూసి వచ్చింది.

'తోట ద్వారాలన్నీ మూశావా?' అన్నాడు.

అన్నీ మూశాను. కాని ఒక ద్వారం మాత్రం తెరువబడి ఉంది అని అన్నది.

'ఏ ద్వారం అది?' అని అడిగాడు.

'దేవుని ద్వారం. ఆ ద్వారాన్ని మూయడం ఎవరితరము కాదు. దేవుని కళ్ళు కప్పలేరు' అని అన్నదామె.

ఆ మాటలు వినటంతోటే ఒక్క కేక వేశాడు. తన తప్పు తెలిసి వచ్చింది. ఆమెను క్షమించమని కోరాడు. ఆమె కోరినవి ఇచ్చి పంపాడు

---

## 26. ఒక వేడి రాత్రి

బాగ్దాద్ నగరంలో ఒక వేడి రాత్రి.

ఖలీఫా, హారునుర్ రషీద్ చాలా విలువైన దుస్తులు ధరించి ఉన్నారు. మొదలే వేడిగా ఉంది. అందులో ఈ దుస్తులు ఇంకా

వేడి కలిగిస్తున్నాయి. ఖలీఫాకు ఈ వేడి భరించరానిదిగా ఉంది. స్థిమితాన్ని కోల్పోతున్నాడు.

ఆ కాలంలో అతి ప్రసిద్ధుడైన ఇబ్నెసమ్మాక్ కూడా ఖలీఫా వద్ద కూర్చొని ఉన్నాడు. ఖలీఫా ఈ దుస్తులతో పడే బాధను గమనిస్తున్నాడు.

'ఖలీఫా! వేడి మిమ్మల్ని కూడా బాధపెడుతుందా? అతి విలువైన దుస్తులు ధరించారుగదా! అవి ఈ వేడినుండి మిమ్మల్ని కాపాడలేవా?'

ఈ దుస్తులు సాధారణ దుస్తులకంటే ఎక్కువ వేడిని కలిగించి బాధపెట్తాయి. ఈపట్టుగాని దానిపై వేసిన చెమ్కీపనిగాని ఇంకా ఎక్కువ వేడి కలిగిస్తాయి' అని ఖలీఫా చెప్పారు.

"మహారాజా! ఈ విలువైన పట్టువస్త్రాలు మిమ్మల్ని వేడినుండి కాపాడనట్లే, మీరాజ్యం, మీ వైభవం మిమ్మల్ని నరకాన్నుండి కాపాడలేవు. నరకము వేడి ఇనుమును కూడా కరిగించి వేస్తుంది. ఈ దుస్తులు ఇచ్చే వేడికే తట్టుకోలేనివారు నరకపు వేడికి ఏమి తట్టుకో గలరు? కాబట్టి మహారాజా! ఈరాజ్యం ఈ అధికారం ఆకర్షణలో పడకుండా మీరు మీ మనసును అల్లాః పైఉంచి ప్రార్ధనలు చేస్తున్నట్లు అయితే ఆ అల్లాః అనుగ్రహమే మిమ్మల్ని కాపాడుతుంది"

ఈఉపదేశం విన్న ఖలీఫా దుఃఖితుడయ్యాడు. సంతత ధారగా కారే కంటి నీరు అతని గడ్డాన్ని తడిపివేసింది.

## 27. దైవ దర్శనం

ఇబ్రహీం-బిన్-అద్దం, బల్క్ అనే దేశాన్ని పరిపాలిస్తున్నాడు. ఎక్కువ కాలాన్ని పూజా పునస్కారాలతో గడిపేవాడు. భక్తులు, పండితులు అతని చుట్టూ ఉండేవారు. రాత్రులంతా దైవ ధ్యానం చేస్తూ, దైవదర్శనం కోసం తపించేవాడు.

ఒక రాత్రి రాజు తన భవనంలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఉన్నట్లుండి పెద్ద శబ్దం వినిపించి, మేల్కొన్నాడు. మేడ మీద ఎవరో తిరుగుతున్నట్లు అనిపించి చాలా ఆశ్చర్యపడ్డాడు. ఆ శబ్దాన్ని వింటూ పెద్దగా కేకవేసి భటుల్ని పిలిపించాడు. మేడపైనున్న వాణ్ణి భటులు తీసుకవచ్చారు.

'నువ్వెవరు? ఎందుకు ఇంతరాత్రివేళ మేడపై తిరుగుతున్నావు? నా భవనంపై తిరిగేందుకు నీకెంత ధైర్యం?' అన్నాడు రాజు.

'మహారాజా! నేను దొంగను కాదు, బందిపోటును కాదు. నా ఒంటె తప్పిపోయింది. దానికోసం వెదుకుతున్నాను' అన్నాడు వాడు.

రాజు చాలా ఆశ్చర్యపడ్డాడు. "నువ్వెంత తెలివితక్కువవాడివి! ఒంటె రాజభవనాలపైకి ఎలా ఎక్కుతుంది? ఈ మాట ఎవరైనా నమ్ముతారా? నిజంగా ఒంటె పోయివుంటే ఎడారులలోగాని ఇంకెక్కడనోగాని వెదుకు దొరుకుతుంది" అన్నాడు రాజు.

'రాజా! నాకంటే తెలివి తక్కువవాడివి నువ్వు. రాజ్యపరిపాలన అనే వలలో చిక్కుకొని దైవదర్శనం కావాలనీ కోరుకుంటున్నావు. ఈ వలలో చిక్కుకున్న వాడికి ముక్తి ఉంటుందా? రాజ్యాన్ని పాలించినంత కాలం, దైవాన్ని చేరుకోలేవు. నీవు రాజ్యాన్ని పాలిస్తూ దైవాన్ని కనుక్కోగలిగితే, నాకు రాజభవనంపైన ఒంటె ఎందుకు కనుపించదు అని అడిగాడు.

ఈ మాటలోని అర్థాన్ని గ్రహించాడు రాజు. అతని కళ్లు తెరుచుకున్నాయి. రాజ్యాన్ని వదిలేసి వెళ్ళిపోయాడు రాజు.

## 28. ఉత్తముడైన గ్రుడ్డివాడు

ఒకనాడు మహాప్రవక్త హజరత్ మహమ్మద్ (సొ) గారు సహాబీలతో ఈవిధంగా సెలవిచ్చారు. పూర్వము బనీ ఇస్రాయీల్‌లో ముగ్గురు వ్యక్తులుండేవారు. వారిలో ఒకడు బొల్లివ్యాధి కలవాడు, రెండవవాడు బట్టతల కలవాడు. మూడవ వ్యక్తి గ్రుడ్డివాడు. వీరు ముగ్గురూ మిత్రులేకాని కడుదరిద్రులు. అల్లాః ఈ ముగ్గురికి కొంత ధనమిచ్చి పరీక్షించదలచి తన దూతను వారివద్దకు పంపాడు. మొదట ఆ దూత మానవ ఆకారంలో బొల్లివ్యాధిగల వాని వద్దకు వచ్చి "నీకేమి కావాలో కోరుకో నీకిస్తాను" అని పలికాడు. అందుకు ఆవ్యక్తి అయ్యా! నాకు బొల్లివ్యాధి వుంది. జనులు నన్ను చూచి అసహ్యించుకుంటు వుంటారు. నాకుగల యీ వ్యాధిని పోగొట్టండి. అంతేచాలు'

అని అన్నాడు. అందుకా దేవదూత తనచేతిని అతనిపై ఉంచి అల్లాఃను ప్రార్థించాడు. వెంటనే అతని వ్యాధి నయమైపోయింది. తరువాత ఆ దూత "బ్రతుకుతెరువు కొరకు ఏమి కోరుకుంటావో కోరుకో అని" అడిగాడు. ఆయన మాటలు విన్న ఆవ్యక్తి నాకు ఒక మంచి ఆడఒంటె కావాలి అని అర్థించాడు. వెంటనే ఆ దేవదూత అతనికి ఒంటెను ఇచ్చి దాని అభివృద్ధి కొరకు అల్లాఃను ప్రార్థించాడు.

తరువాత ఆ దూత బట్టతలగల వాడిదగ్గరకు వచ్చి 'నీకేమి కావాలో కోరుకో' అని ప్రశ్నించాడు. అందుకతడు అయ్యా! నాకు బట్టతల వుంది. నా తలపై అందమైన జుట్టు కావాలి అని కోరాడు. అందుకా దూత తన చేతిని బట్టతలపై వుంచి అల్లాఃను ప్రార్థించాడు. వెంటనే అతని తలపై వెంట్రుకలు మొలిచి అందమైన జుట్టు వచ్చింది. తరువాత బ్రతుకుదెరువు కొరకు దేన్ని కోరుకుంటావో కోరుకో అని ప్రశ్నించాడు. దానికి ఆవ్యక్తి మంచి ఆవు కావాలి అని అడిగాడు. అతని కోరిక మేరకు ఆ దూత ఆవును యిచ్చి దాని అభివృద్ధి కొరకు అల్లాఃను ప్రార్థించాడు.

ఆఖరున ఆ దేవదూత గ్రుడ్డివాని దగ్గరకు వచ్చి అదేవిధంగా ప్రశ్నించాడు. దానికి గ్రుడ్డివాడు అయ్యా! నేను గ్రుడ్డివాడను. ప్రపంచములో ఉండికూడ దేనిని చూడలేకున్నాను. గ్రుడ్డివాళ్ళకు కళ్ళకన్నా ఇంకేమి కావాలి. నాకు దృష్టిని ప్రసాదించండి. అంతేచాలు అని వేడుకొన్నాడు. అతని మాటలు విన్న ఆదూత తన చేతులను అతని కళ్ళపై వుంచి అల్లాఃను ప్రార్థించాడు. వెంటనే అతనికి దృష్టి

లభించింది. ఆ తరువాత నీ బ్రతుకు తెరువు కొరకు ఏమికోరతావో కోరుకో అని ప్రశ్నించాడు. అయ్యా నాకు మంచిమేకను ప్రసాదించండి అని అర్ధించాడు. వెంటనే ఆ దూత మంచి మేకను ఇచ్చి దాని అభివృద్ధి కొరకు అల్లాఃను ప్రార్ధించి వెళ్ళిపోయాడు. కొంతకాలానికి వీరికి ప్రసాదించిన పశువులు మంచి అభివృద్ధి కలిగి ముగ్గురు బాగా ధనవంతులయ్యారు.

అలా వారు ధనవంతులై సంతోషంగా కాలము గడుపు తున్నప్పుడు ఆ దేవదూత మరలా తన వెనుకటి రూపంలోనే మొదటి వ్యక్తి అయిన బొల్లివ్యాధి వానివద్దకొచ్చి "అయ్యా అల్లాః నీ బొల్లి వ్యాధి నయంచేసి, పశుసంపద నిచ్చారుకదా! అందులోనుండి అల్లాః పేరిట నాకు కొంత దానం యిమ్మని అర్ధించారు. అందుకా వ్యక్తి అబద్ధం శుద్ధ అబద్ధం, నాకు బొల్లివ్యాధి ఎప్పుడూ లేదు. ఈ ఒంటెలు నాకు నా పూర్వీకుల నుండి సంక్రమించాయి అని చెప్పి దానమివ్వ నిరాకరించాడు. అంతట ఆ దూత అల్లాః నీకు పూర్వస్థితికి తెచ్చు గాక! అని శపించాడు. తరువాత బట్టతల వానివద్దకు వచ్చి అదే విధముగా దానము కోరాడు. దానికి ఆ బట్టతల వ్యక్తి మొదటివాడు యిచ్చినట్లే సమాధానమిచ్చి దానము నివ్వ నిరాకరించాడు. అందుకా దూత మొదటివ్యక్తిని శపించినట్లే అతనిని కూడ శపించాడు.

ఆఖరున ఆ దేవదూత గ్రుడ్డివాని దగ్గరకు వచ్చి అల్లాః పేరిట దానం అడిగాడు. అందుకావ్యక్తి "అయ్యా ఇవన్నీ దైవప్రసాదితములే. నా కళ్ళు కూడ ఆయనవే. ఈ సంపదలో మీకిష్టమొచ్చినంత

తీసుకొండి. నేను యిస్తాను. ఆయన సొమ్ము ఆయనకు యిచ్చేదానికి నాకేమి అభ్యంతరం లేదు" అని సమాధానమిచ్చాడు. అప్పుడు ఆ దేవదూత సంతోషించి "నేను మీముగ్గురిని పరీక్షించుటకు పంపబడిన దేవదూతను. ఈపరీక్షలో నీవు నెగ్గావు. దేవునిసొమ్ము దైవమార్గంలో ఖర్చుపెట్టుటకు సిద్ధపడ్డావు. నీకు అల్లాః మేలుచేయుగాక! కాని ఆ యిద్దరు దైవ సహాయమును మరచి అల్లాః ప్రసాదించిన సొత్తును తమదిగా భావించి దైవమార్గములో ఖర్చు పెట్టుటకు నిరాకరించారు. అందుకే వారు మరల వెనుకటి స్థితికే వచ్చారు అని సెలవిచ్చి వెళ్ళిపోయాడు.

(మిష్కాటె షరీఫ్)



## 29. శిక్ష

ఇబ్రహీం-బిన్-అద్హమ్ రాజు వద్ద ఒకదాసి ఉండేది. అతనికి సేవచేస్తూ, స్నానానికి నీళ్ళు తోడేది, పాన్పు సరిచేసేది, దానిని పూలతో అలంకరింపచేసేది.

ఒక రోజు రాత్రి పాన్పును అలాగే చేసింది. దానిపై కాసేపు పడుకుంటే ఎంత హాయిగా ఉంటుందో అనుకుంది. రాజుగారు వచ్చేందుకు ఇంకా సమయముంది. కాసేపు పడుకుని లేద్దామని భావించింది.

పాన్పుమీద మేను వాల్చింది. మరి మెత్తటి పడక కదా! అలా పడుకోవడంతోటే నిద్రపట్టింది. మెలకువ రాలేదు.

ఇంతలో రాజు వచ్చాడు. చూచి ఆగ్రహించాడు. ఒక మామూలు దాసి తన పాన్పు మీద నిద్రించడమా? దానికి ఎంత మదం, కండకావరం అనుకున్నాడు.

భటులను పిలిచి ఆ దాసీని లేపి, కొరడా దెబ్బలు వేయమని ఆజ్ఞ ఇచ్చాడు రాజు.

భటులు తీసుకపోయి కొరడాతో కొడుతున్నారు. బాధదో ఏడ్వటానికి బదులు దాసి నవ్వుతుంది.

రాజుకు మరీ కోపం వచ్చింది. "నీవు ఎందుకు నవ్వుతున్నావు?" అని అడిగాడు.

"మహారాజా! కాసేపు పడుకున్నందుకే, కొంచెం సుఖం అనుభవించినందుకే నాకిన్ని కొరడా దెబ్బలు తగులుతున్నాయే. మీరు రోజూ దానిపై శయనిస్తున్నారు, సుఖాన్ని అనుభవిస్తున్నారుగదా! మీకెన్ని దెబ్బలు తగులుతాయో? మీరెంత శిక్ష అనుభవించవలసి వస్తుందో" అని అన్నది.

రాజు దిమ్మెరపోయాడు. జ్ఞానోదయమైంది. తన తప్పు తెలుసు కున్నాడు. అప్పటినుంచి సుఖాలకు దూరం కావడానికి ప్రయత్నించాడు.

# 30. లోటా నీరు

హరునుర్ రషీద్ బాగ్దాదును పరిపాలిస్తున్నాడు. షఫీక్ బల్ఖీ హజ్ యాత్రకు వెళ్తూ బాగ్దాదు చేరారు. వారి రాక తెలిసి వారిని దర్బారుకు సగౌరవంగా పిలిపించాడు హరునుర్ రషీద్.

'తమరేనా షఫీక్ అనే మహాత్ములు?' అని రాజు అడిగాడు.

'నేను షఫీక్‌నేకానీ మహాత్ముణ్ణి కాదు' అని సమాధానము చెప్పారు.

'మీరు నాకేమైనా ఉపదేశించండి' అని అడిగాడు రాజు.

'ఓరాజా! ఒకవేళ నీవు యెడారిలో ప్రయాణించేప్పుడు దాహంతో ప్రాణాలు పోయేట్లుంటాయి అనుకో. అప్పుడు ఎవరయినా ఒక లోటా మంచినీళ్ళు తెచ్చి సగం రాజ్యం యిస్తే ఆ నీరు ఇస్తానంటారు అనుకో. ఆ నీళ్ళు కొని ప్రాణాన్ని రక్షించుకుంటావా? అని ప్రశ్నించారు.

'రాజ్యం ప్రాణాలకంటే ఎక్కువకాదు మహాత్మా! అలాగే సగం రాజ్యం ఇచ్చి నీరు తప్పక తీసుకుంటాను' అన్నాడు రాజు.

'సరే ఆ నీరు తీసుకొని త్రాగుతావు. పొట్ట ఉబ్బరం వచ్చింది. త్రాగిన నీరు బయటకు పోక ప్రాణం కడగట్టేట్టుందనుకో, ఎవరైనా వైద్యుడు వచ్చి 'బయటకుపోని నీటిని తీసి నీ ప్రాణం కాపాడుతాను సగం రాజ్యమిస్తావా అనిఅడిగితే సగం రాజ్యమిస్తావా? లేక ప్రాణాలు పోగొట్టుకుంటావా? అని ప్రశ్నించారు షఫీక్.

"మహాత్మా! మిగతా రాజ్యమిచ్చియైనా ప్రాణం కాపాడు కుంటాను" అన్నాడు రాజు.

"ఓ రాజా! నీవు రాజునని, విశాల సామ్రాజ్యానికి అధిపతివని గర్విస్తావు. ఇంత రాజ్యము కూడా ఒక్క లోటా నీటి ఖరీదు. వావ బ్రతుకులు ఒక్క లోటా నీటిపైనే ఆధారపడిఉన్నాయి. ఆ నీటినిచ్చే వాడు అల్లాః. ఆ ఒక్క లోటా నీటి ఖరీదు ఒక రాజ్యమైతే ఈ సృష్టిలో అల్లాః ఎన్ని పదార్థాలనిచ్చాడు. మన సౌఖ్యానికి మన ఆనందానికి ఎన్నిటిని సృష్టించాడు? వాటన్నిటి ఖరీదెంత? కాబట్టి ఆ సర్వ జగత్తునూ సృష్టి చేసిన అల్లాః లీలలను స్మరిస్తూ గర్వంలేకుండా రాజ్యం చెయ్యి" అని సందేశమిచ్చారు.

"నీవు నిజమైన మహాత్ముడివి. నా కళ్ళు తెరిపించావు" అని అతణ్ణి గౌరవ మర్యాదలతో హజ్ యాత్రకు పంపించాడు.

హారునుర్ రషీద్ సంతతధారగా కన్నీరు కారుస్తూ అల్లాః మహిమను స్మరించాడు.



## ఈ రచయిత యొక్క యితర రచనలు (ఉర్దు భాషలో)

1. హఫీజుల్-ఖవాయిద్ (వ్యాకరణము)
ఆంధ్ర, అన్నామలై, మద్రాసు మరియు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయము వారిచే 7th ఫామ్, పి.యు.సి. మరియు బి.ఏ. కు పాఠ్యగ్రంథముగా అంగీకరింపబడినది.
వెల రు. 12-00
2. ఫిర్-దౌసె-నజర్ (ఉదయగిరి చరిత్ర) రు. 5-00
3. ముఖ్తసర్-తారీఖ్ ఆలమె ఇస్లాం రు. 10-00
4. షువాయె-నూర్ (సూక్తి ముక్తావళి) రు 8-00
5. లమ్ఆత్-ఎ-ఈమానీ రు. 8-00
6. పహిలి మంజిల్ రు. 6-00
7. ఇన్సానియత్ కె చరాగ్ రు. 8-00
8. దుర్-బే-బహ రు. 10-00
9. తోషా-ఎ-ఆఖిరత్ రు 12-00
10. చహల్ హదీస్ రు. 1-00
11. నాయాబ్ జవాహెర్ రు. 20-00
12. చంద్ బాతేం రు. 12-00
13. మష్అల్-ఎ-రాహ్ రు 8-00
14. రోషని కె మీనార్ రు. 8-00
15. మానవతా దీపం (తెలుగు) రు. 8-00
16. కాంతి శిఖరాలు (తెలుగు) రు. 8-00
17. కాంతి కిరణములు (తెలుగు) రు. 12-00
18. ఆసాన్ నమాజ్ (తెలుగు) రు. 5-00
19. కఫన్-ఓ-దఫన్ కీ తరకీబ్ (తెలుగు) రు. 2-00
20. నీతి వెలుగులు (తెలుగు) అండర్ ప్రింటింగ్

కావలసినవారు యీక్రింది అడ్రసుకు వ్రాయగోరుచున్నాము

**జఫర్ బుక్ డిపో,**

10-49-64, కచ్చేరిమిట్ట, కావలి, నెల్లూరు జిల్లా.